

కల

నిజమవుతుంది

చిన్న పిల్లలు మిఠాయిలు మరియు తినుబండారములు కావాలని
కలలు కంటారు...చిన్న పిల్లలు ఎక్కువగా కావాలనేవి
రుచికరమైన మరియు పుష్టికరమైన
సాఠె మాల్టెక్స్ బిస్కట్లు.
వీటిని తింటే వారి కలలు నిజమవుతాయి.

**సాఠె బిస్కట్లు**

తరతరముల వారికి శక్తిని ఇచ్చే ఆహారము



సాఠె బిస్కట్ అండ్ చాకొలేట్ కంపెనీ లి., పూనా-2

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.

చందమామ (అన్ని భాషలలో)

(విడి కాపీ 60 నయా పైసాలు)

సాలు చందా రు. 7-20 నయా పైసాలు

ఎల్లప్పుడూ టినోపాల్
ఉపయోగించి
దుప్పట్లను
తలగడా గలేబులను
టేబుల్ గుడ్డలను
కళ్లు మిరుమిట్లు
గొలిపేలా తెల్లగా మరింత
తెల్లగా ఉంచుకోండి




క్రమం తప్పకుండా టినోపాల్ ఉపయోగించి మీ దుప్పట్లను, తలగడా గలేబులను, టేబుల్ గుడ్డలను, తువ్వాళ్లను మెరిసేలా తెల్లగా ఉంచుకోండి — ఎల్లప్పుడూ! మీరు టినోపాల్ వాడితే మీ యింట్లో వాడుకునే దుప్పట్లు మొగలైనవి, వెలిసిపోయి మాసిపోయినట్లు ఉండవు. టినోపాల్‌ను క్రమంగా వాడితే మాత్రమే మీ తెల్లని బట్టలు నిజంగా తెల్లగా ఉంటాయి. కనుక మీరు తెల్లని బట్టలను ఉతికిన తరువాత వాటిని టినోపాల్ కలిపిన నీళ్లలో జాడించండి—ఎల్లప్పుడూ!




టినోపాల్ జె. ఆర్. గెయిగీ, ఎస్. ఎ. బాల్, స్విట్జర్లెండ్ వారి రిజిస్టరు చేయబడిన ట్రేడు మార్కు.

ఉత్పత్తిదారులు :
సుహృద్ గైగీ లిమిటెడ్ వడి వాడి, బరోడా

geigy

సోల్ డిస్ట్రిబ్యూటర్లు:
సుహృద్ గైగీ ట్రేడింగ్ లిమిటెడ్ పోస్ట్ బాక్స్ 965, బొంబాయి-1 బి.ఆర్.

SISTA'S SG 174A

TEL

మీరు మీ ఊరిలో మా "చందమామ" అమ్మే చిన్న ఏజంటుగా ఉండవచ్చును. దీనికి మీరు మనిఆర్డరు ద్వారా రు. 3-60 పంపిన 8 "చందమామ" కాపీలు మీకు సప్లయి చేస్తాము. లేదా ప్రారంభంలో 4 కాపీలు మాత్రం చాలంటే రు. 1-80 పంపండి. ప్రతి ఒక్కొంటికి 15 న.పై. చొప్పున మీకు లాభిస్తుంది. అయితే డబ్బు పంపేముందు మీ ఊరిలో ఇప్పటికే మా ఏజంటు ఎవరూ లేరు అనే విషయం రూఢిచేసుకోండి.



చందమామ పబ్లికేషన్సు
వడపళని :: మదరాసు - 26




ఎక్కడ

# లైఫ్‌బాయ్ ఉన్నదో

## అక్కడ ఆరోగ్యము ఉన్నది

లైఫ్ బాయ్ సబ్బు మురికిలో గల క్రిములను కడిగి వేయును.
లైఫ్ బాయ్ వల్ల-కుటుంబములో అందరి జీవితం ఆరోగ్యవంతం !

L. 39-77 TL

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి



తప్పక చూడండి!
వాసవి ఫిలిమ్స్
అనుబంధాలు
శ్రీ ఫిలిమ్స్
దర్శకత్వం: రామకృష్ణ
నిర్మాత: కె. వెంకటేశ్వరరావు




## ఆగస్టు 1963

అన్ని కథల కంటె ‘‘రాకాసిలోయ’’, ‘‘గంధర్వ చక్రవర్తి కూతురు’’, చాల బాగున్నవి. ‘‘అర్థం కాని ఉపదేశాలు’’, ‘‘ఎవరు పెట్టాలి? ఎవరి తినాలి?’’ చాల గమ్మతుగ వున్నవి.

—వరగంటి శంకరయ్య, మంగంపేట

నన్ను అన్ని కథల కంటె ‘‘గంధర్వ చక్రవర్తి కూతురు’’ ఆకర్షించినది. ‘‘రాకాసిలోయ’’, ‘‘పరీక్షా ఫలితం’’, ‘‘ఎవరు పెట్టాలి? ఎవరు తినాలి?’’ ‘‘రామాయణం’’ చాలా బాగున్నాయి.

—టి. భారతి, హైదరాబాదు

‘‘రాకాసిలోయ’’ సీరియల్ చాలా బాగున్నది. అది త్వరలో ముగించ వద్దు. వడ్డాది పాపయ్యగారి ముఖ చిత్రములు చాలా బాగున్నవి. ‘‘చందమామ’’ ఎంత ఖరీదైన కొనెదను.

—రాచకొండ నరశింహారావు, కోమటిపల్లి

‘‘అర్థంకాని ఉపదేశాలు’’, ‘‘పరీక్షా ఫలితం’’ చాలా బాగుగా యున్నవి. ‘‘రాకాసిలోయ’’ సీరియల్ అద్భుతంగా ఉన్నది. ‘‘ఎవరు పెట్టాలి? ఎవరు తినాలి?’’ కథ కడుపు చెక్క లయ్యేట్టుగా నవ్వించింది. కథ లన్నీ చాలా బాగున్నాయి.

—వి. వాసంతి, ఖమ్మం

చిన్న కథలు ఏమంత బాగులేవు. కాని ఈ పర్యాయం ‘‘రామాయణం’’, ‘‘రాకాసిలోయ’’ సీరియల్స్ ఆలోపాన్ని కప్పివేశాయి.

—‘‘సాయిప్రకాష్’’, విజయనగరం

మామా, నీ వరసేమీ బాగుందికాదు. రామరామా, ఎప్పుడూ ఆలశ్యమే! ఈ నెల మరీనూ!

—కుచ్చెర్లపాటి సుబ్బరాజు, కొత్తలంక

"రాకాసిలోయ" అద్భుతాశ్చర్యకరంగ నున్నది. "గంధర్వ చక్రవర్తి కూతురు" ముగించేసి నందుకు చాలా చింతించుచున్నాము. "పరీక్షా ఫలితం", "అష్టంకాని ఉపదేశాలు", "మనో వ్యాధే మందు" చాల బాగున్నవి. "ప్రపంచపు వింతలు" ఆల్బమ్ తయారు చేసుకొనుటకు చాల ఉపయోగపడుచున్నవి.

తనికెళ్ల వెంకటరమణశాస్త్రి, పార్వతీపురము

ఈ నెల "చందమామ" ఎంతో ముచ్చటగా నున్నది. ముఖ్యముగా "రాకాసిలోయ", "పరీక్షా ఫలితం", "అష్టంకాని ఉపదేశాలు", "రామా యణం", "చాణక్యుడి కథ", "భారత చరిత్ర" చాలా ఆకర్షించుచున్నవి.

—డి. వెంకటాచలపతి, బెంగళూరు

జూలై నెల "చందమామ" చల్లని వాతావరణ ములో చక్కని కథలతో, రంగుల హంగులతో సింగారించుకుని, ఆలస్యముగా వెలువడినా, అత్యాకర్షణీయముగా ఉన్నది.

-శిరిగినీడి సత్యనారాయణమూర్తి, ఏలూరు

జూలై నెల ముఖచిత్రం ఆకర్షణీయంగా ఉన్నది. "మనోవ్యాధే మందు", "ఎవరు పెట్టాలి? ఎవరు తినాలి?" అనే కథలు ఎంతో బాగున్నాయి. ఈసారి తాతయ్య కథ బాగా చెప్పలేదు.

గుండుపుళ్ళ వెంకటరామారావు, శ్రీకాకుళం

"మనోవ్యాధే మందు", "పరీక్షా ఫలితం", "అష్టంకాని ఉపదేశాలు" చాలా బాగున్నవి. "ఎవరు పెట్టాలి? ఎవరు తినాలి?" గమ్మత్తుగ వున్నది. "రాకాసిలోయ" చాలా రసవత్తరంగ వుంది. "గంధర్వ చక్రవర్తి కూతురు" ముగింపు చాలా బాగుంది.

—వి. యస్. జగన్నాథరావు, తిరువూరు



కర్తవ్య
నిర్వహణలో మొదటి
వరుసలో...
మన సైనికులలో శక్తి, ఉత్సాహములకు కొదువ
లేదు మరియు రుచికరమైన, శ్రేష్ఠమయిన
మరియు శక్తిదాయకమైన జె.బి. మంఘారామ్స్
బిస్కట్లు మరియు మిఠాయిలు వారికి ఉత్సాహము
మరియు అధిక శక్తిని యిస్తాయి. వారి కఠినమైన
జీవనముతో యివి వరప్రసాదము!
జె.బి. మంఘారాం అండ్ కం.
గ్వాలియర్ అండ్ హైదరాబాదు
వివిధ రకముల బిస్కట్లు మరియు కన్ఫెక్షనరీ తయారీలో
అత్యంత ఘనమైన జాతీయ సంస్థ.




Salts
Royal Choices


OB-106A TEL



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

జూను 21 మొదలుకొని జులై మొదటి వారం వరకూ మద్రాసులో పరిశ్రమలకు సరఫరా చేసే విద్యుత్తులో 80 శాతం కోత పెట్టారు. ఆ కారణం చేత జులై "చందమామ" చాలా ఆలస్యమయింది. ఇందువల్ల పాఠకులకు కలిగిన అసౌకర్యానికి ఎంతైనా విచారిస్తున్నాము.

"రాకుమారి జులేకా" అనే మరొక అరేబియా దేశపు కథ ఈ సంచికలో ప్రారంభించాము. ఇది చిన్న కథ. పై సంచికతో ఇది పూర్తి అవుతుంది.

ఈసారి శాస్త్ర విజ్ఞానం కింద ఉల్కలను గురించి ప్రచురిస్తున్నాము. అంతరిక్షయానాల యుగం ఆరంభమయింది గనక ఆకాశానికి సంబంధించిన వైజ్ఞానిక విషయాలు పాఠకులకు ఆసక్తి కలిగించవచ్చు.

సంపుటి : 33 - ఆగస్టు 1963 -| సంచిక : 2









# భారత చరిత్ర



దేవగిరి రాజైన రామచంద్రదేవుడు అలా ఉద్దీన్ సుల్తానుకు వరసగా మూడేళ్ళు కప్పం చెల్లించ లేదు. పై పెచ్చు, సుల్తానుకు ఓడి పారిపోయి వచ్చిన గుజరాతు రాజు రెండవ రాయకర్ణదేవుడికి రక్షణ ఇచ్చాడు. అందుచేత 1307 మార్చిలో సుల్తాను దేవగిరి పైకి మలిక్ కాఫూర్ నాయకత్వాన సేనలను పంపాడు. కాఫూర్ దేవగిరి పరిసరాలన్నీ కొల్లగొట్టి విధ్వంసం చేశాడు. రామచంద్రదేవుడు ఓటమి అంగీకరించి సంధి కోరాడు. సుల్తాను ఆయనను ఢిల్లీకి రప్పించి, మర్యాద చేసి, ఇక మీదట ఆయన ఢిల్లీ కింద సామంతుగా ఉండి కప్పం చెల్లించేటట్టు సంధి చేసుకున్నాడు.

1303లో కాకతీయ ప్రతాపరుద్రుడిపై అల్లా ఉద్దీను పంపిన దాడి విఫలం అయినందున 1309లో కాఫూర్‌ను మరొకసారి పంపాడు. కాకతీయుల సంపదను కొల్లగొట్టటమేగాని వారి రాజ్యాన్ని అపహరించి తన రాజ్యంలో కలుపుకోవటం సుల్తాను ఉద్దేశం కాదు. ప్రతాపరుద్రుడు వరంగల్లు కోటలో భద్రంగా కూచుందామనుకున్నాడు గాని చివరకు లొంగిపోక తప్పలేదు. 1310 మార్చిలో ఆయన సంధి బేరానికి దిగి వచ్చి, శత్రువులకు 100 ఏనుగులూ, 1000 గుర్రాలూ, అంతులేని నాణాలూ, మణులూ సమర్పించి, ఏటా ఢిల్లీకి కప్పం చెల్లించ ఒప్పుకున్నాడు.

ఈ విజయాలతో సుల్తానుకు దూరాన ఉన్న దక్షిణ రాజ్యాలపైన కూడా కాంక్ష కలిగింది; అక్కడి ఆలయాలలో అంతులేని ధనరాసులున్నాయి. 1310 నవంబరు 18న మలిక్ కాఫూర్, ఖ్వాజా హాజీల నాయకత్వాన ఢిల్లీ నుంచి పెద్ద సేన బయలుదేరి హొయసల రాజ్యం పైకి నడిచింది. ఈ సేన ద్వార సముద్రం చేరే

## 23. ఖిల్జీ సామ్రాజ్యం - దక్షిణభారతం

సమయానికి హొయసల రాజైన మూడవ వీరబల్లాలుడు యుద్ధానికి సిద్ధంగా లేడు. శత్రు బలాలు హెచ్చుగా ఉండటం చూసి ఆయన సంధికి ఒడబడి తన సంపద యావత్తూ వారికి అప్పగించాడు. ఈ ధనం గాక శత్రువులు 36 ఏనుగులను పట్టుకుని, ఆలయాలలో ఉన్న అంతులేని వెండి బంగారాలను కొల్లగొట్టి, హొయసల రాజకుమారుణ్ణికూడా తమ వెంట పట్టుకుపోయారు.

ద్వారసముద్రంలో 12 రోజులు మాత్రమే ఉండి మలిక్ కాఫూర్ తన సేనలను పాండ్య రాజ్యం మీదికి నడిపించాడు. ఈ రాజ్యాన్ని మాబార్ అనేవారు. పాండ్య రాజ్యంలోని అంతః కలహాలు శత్రువులకు అనుకూలించాయి. పాండ్య రాజైన కులశేఖరుడికి సుందరపాండ్యుడూ, వీర పాండ్యుడు అని ఇద్దరు కొడుకులు. సుందర పాండ్యుడు సక్రమవారసుడు; వీరపాండ్యుడికి వారసత్వపు హక్కు లేదు. కాని కులశేఖరుడికి అతనిపై ప్రేమ హెచ్చుకావటం చేత తన అనంతరం అతనినే రాజు చేద్దామనుకున్నాడు. 1310 మే నెల అంతంలో సుందరపాండ్యుడు తండ్రిని హత్య చేసి రాజ్యం వశపరచుకొన జూశాడు. అన్నదమ్ములకు యుద్ధమయింది. నవంబరు




నెలలో సుందరపాండ్యుడు ఓడిపోయి ముసల్మానుల సహాయం అర్థించాడు.

1311 ఏప్రిలు 14 న తన సేనతో మలిక్ కాఫూర్ పాండ్యరాజధాని అయిన మదురకు వచ్చాడు. మదుర నిర్జనంగా ఉన్నది. వీరపాండ్యుడు తన రాణులతో పారిపోయాడు. ముస్లిములు అరక్షితమైన మదురను కొల్లగొట్టి 512 ఏనుగులూ, 5000 గుర్రాలూ, 500 మణుగుల బరువు గల వివిధ రత్నాలూ సంపాదించారు. మలిక్ కాఫూర్ మాబార్ దేశాన్ని కొల్లగొట్టి 1311 అక్టోబరు 18న ఢిల్లీకి తిరిగి వచ్చినప్పుడు అతని వెంట 612 ఏనుగులూ,

20,000 గుర్రాలూ, 96,000 మణుగుల బంగారమూ, అనేక వందల పెట్టెలనిండా రత్నాలూ ఉన్నాయి!

ఈ విధంగా దక్షిణదేశమంతా ఢిల్లీ సామ్రాజ్యంలో చేరిపోయింది. ఈ సామ్రాజ్యాన్ని విస్తరింప జేసిన అలాఉద్దీన్ పరిపాలన గురించి మనం తెలుసుకోదగిన అంశాలు అనేకం ఉన్నాయి. అతను మొదటిసారిగా రాజ్యపాలనలో మతాధికారులకు "వాక్కు" లేకుండా చేశాడు; రాజ్యతంత్రాన్ని మత నియమాల నుంచి వేరు చేశాడు—రాజ్యం సుస్థిరంగా ఉండటమే ప్రధానాశయంగా పెట్టుకున్నాడు.

అలా ఉద్దీన్ పరిపాలనలో ఆస్తి అనేది చాలామందికి లేకుండా పోయింది. మాన్యాలు మొదలైనవి రద్దయాయి. దేవాదాయాల లాటివి ప్రభుత్వ పరమయాయి. తాగుడూ, మాదద్రవ్యాలూ, జూదాలూ, ధనికుల విందులూ, వినోదాలూ, సమావేశాలూ నిషేధించబడ్డాయి. ఎవరి దగ్గిరా బంగారంగాని, వెండిగాని లేదు. పన్నులు తీవ్రంగా పెంచబడ్డాయి.

ఇలాటి ఆర్థిక పరిస్థితిని వర్తకులు స్వార్థానికి వినియోగించ కుండా అలా ఉద్దీన్ కట్టుదిట్టాలు చేశాడు. వస్తువుల ధరలు శాసనం ద్వారా నిర్ణయించబడ్డాయి. క్రయ విక్రయాలు బహిరంగంగా జరగాలి. తక్కువ తూకం తూచిన వాడి నుంచి తరుగుదలకు సరిపడే మాంసం కోయమని రాజశాసనం!

1312 దాకా అలాఉద్దీన్ ప్రభ బాగా వెలిగింది. ఆ తరవాత అతనికి చెడ్డరోజులు సంప్రాప్తమయాయి. అతను మలిక్‌కాఫూర్ చేతి కీలు బొమ్మ అయిపోయాడు. ఆ కొజ్జావాడే ఆయనకు సేనానాయకుడూ, మంత్రి.

దేశంలో తిరుగుబాట్లు సాగాయి. చివరకు అలాఉద్దీన్ 1316 జనవరి 2న చనిపోయాడు. ఢిల్లీలోని జామీమసీదుకు ఎదురుగా అలాఉద్దీన్‌ను ఖననం చేసి గోరీ కట్టారు.





# యుక్తిగల కళాసు

బర్మాదేశంలో ఒక పడవల యజమాని ఉండేవాడు. వాడు మహా జిత్తులమారి. వాడి పడవలు ఐరావతీనది దిగువకు ప్రయాణం చేసి మళ్ళీ ఎగువకు వస్తూండేవి. ప్రతి ప్రయాణానికీ వాడు కళాసులను మాట్లాడుకుని, దారి పొడుగునా వారికి భోజనాలు పెట్టి, ప్రయాణం పూర్తి అయినాక కూలి డబ్బులు ఇచ్చేటట్టు ఏర్పాటు చేసుకునేవాడు. ప్రయాణం రేపు ముగుస్తుందనగా ఏదో యుక్తి పన్ని వారి కివ్వవలిసిన డబ్బు ఎగవేస్తూ ఉండేవాడు.

ఒక ప్రయాణంలో కళాసులుగా కుదిరిన వాళ్ళలో కొండప్రాంతం వాడొకడున్నాడు. వాడు చూడటానికి బొత్తిగా అమాయకుడిలాగా కనిపించాడు. వాడు ఇతర కళాసులతో కలవక, పెడపెడగా ఉంటూ వచ్చాడు. అందుచేత వాళ్ళు అతనితో యజమాని మోసగాడని చెప్పలేదు.

పడవలు బర్మా దిగువ ప్రాంతానికి వచ్చాయి. అవి తిరుగు ప్రయాణం అయే సమయంలో పడవల యజమాని కొండ మనిషితో, "నా మాట విని ఒక కోడిపుంజును కొనుక్కో. ఈ దిగువ బర్మాలో కోళ్ళు కారు చౌక, ఎగువ బర్మాలో చచ్చే ఖరీదు. ఒక కోడిపుంజును ఇక్కడ కొని అక్కడ అమ్మావంటే బోలెడంత లాభం!" అన్నాడు.

కొండమనిషికి ఈ సలహా నచ్చింది. వాడు ఒక కోడిపుంజును కొని రోజూ వంటసాల నుంచి కాసిని బియ్యం గింజలు తీసుకుని దానికి పెడుతూ వచ్చాడు. ప్రయాణం ముగిసే రోజున పడవల యజమాని కొండమనిషిని పిలిచి, "చూడవోయ్, ప్రయాణంలో నీకు తిండి పెట్టటం నాకు విధాయకంగాని నీ పుంజును మేప వలిసిన అవసరం నా కేమీ లేదు. అందుచేత నేను నీ కోడి తిన్న గింజలకు ధర కట్టాను.

వి. రామచంద్రరావు



నేను నీ కివ్వవలసిన కూలికీ దానికీ సరి పోయింది. అందుచేత నే నింక నీ కేమీ ఇవ్వ నవసరం లేదు," అన్నాడు.

కొండమనిషి కొంచెం కూడా అభ్యంతరం చెప్పక, "అది న్యాయమేగద!" అన్నాడు.

మిగిలిన కళాసులు వాణ్ణి చూసి నవ్వు కుని, "ఈ కొండమనుషులు వట్టి మొద్దు వెధవలు!" అనుకున్నారు.

కొండమనిషి ఇంటికి వెళ్ళి, ఒకే ఆకారం గల రెండు విచిత్రమైన కత్తులను తయారు చేసుకున్నాడు. తరవాత పడవల యజమాని దగ్గిరికి వెళ్ళి, "ఈసారి ప్రయాణానికి కూడా నన్ను తీసుకోండి," అని కోరాడు.

వాడి జీతం డబ్బులు మళ్ళీ కాజెయ్య వచ్చునన్న ఆశతో పడవల యజమాని సంతోషంగా సమ్మతించాడు. మళ్ళీ పడవలు ప్రయాణమైనాయి. ఇతర కళాసులు కొండమనిషిని వేళాకోళం చేస్తూ, "మళ్ళీ పుంజును కొంటావా ఏమిటి?" అని అడిగారు.

"అదేమోగాని, ఈసారి ప్రయాణం లాభంగా ఉండవచ్చు. ఎందుకంటే మా నాన్న నాకీ మహిమ గల కత్తి ఇచ్చాడు," అంటూ కొండమనిషి తాను తయారు చేసుకున్న కత్తులలో ఒకటి అందరికీ చూపాడు. రెండవ దాన్ని వాడు తన దుస్తులలో అతి జాగ్రత్తగా దాచు కున్నాడు. దిగువ బర్మా చేరిసదాకా కళాసులు కొండమనిషిని ఆ మహిమగల కత్తిని గురించి ఏడిపిస్తూనే వచ్చారు. వాడు వాళ్ళ మాటలను ఏమీ పట్టించుకోలేదు.

"నీ మంత్రాల కత్తి ఏం చేస్తుంది?" అని వాళ్ళు అడిగేవాళ్ళు.

"అదేమో నాకు తెలియదుగాని, అది మహిమగల కత్తిమటుకు ఔను," అనేవాడు కొండమనిషి.

పడవలు దిగువ బర్మా చేరుకుని మళ్ళీ ఎగువకు ప్రయాణం ప్రారంభించాయి.

కళాసులు కొండమనిషిని కత్తి గురించి ఏడి పించటం విసుగెత్తి మానేశారు. కాని ఒక నాటి మధ్యాహ్నం పడవలు ఒక గ్రామం వద్ద రేవులో నిలిచి ఉండగా కొండమనిషి తన కత్తి తీసి, పడవ అంచున పదును పెట్టసాగాడు. అది చూసి కళాసులు మళ్ళీ వేళాకోళాలు సాగించారు. కొండమనిషి వారితో ఏదో అనబోయి వెనక్కు తిరిగే సమయంలో వాడి చేతిలోని కత్తి జారి నీటిలో పడిపోయింది.

"వెంటనే దిగి నీ కత్తిని తెచ్చుకో!" అన్నారు మిగిలిన కళాసులు.

"తొందరేమిటి? అది ఎక్కడికి పోతుంది. ఎవరైనా ఒక కత్తి ఇవ్వండి," అని కొండ వాడు మరొకడి కత్తితో పడవ అంచున గుర్తుగా గాటు పెట్టాడు. "ఈ గుర్తును బట్టి నీటిలో దిగి ఎప్పుడైనా కత్తిని తెచ్చుకో వచ్చు," అన్నాడు వాడు.

"బుద్ధిలేని వెధవా, ఇంకో క్షణంలో పడవలు కదలబోతున్నాయి. నీ కత్తి పడవలతో బాటు నీటి అడుగున నడిచి వస్తుందనుకున్నావా?" అన్నారు కళాసులు.

"అదేమో తెలీదుగాని, కత్తి పడ్డ చోటు గుర్తు పెట్టుకున్నాక కత్తి ఎక్కడికి పోతుంది?" అన్నాడు వాడు.



వెర్రి వెధవతో మాట్లాడే దేమిటని మిగి లిన కళాసులు కొండ మనిషిని వదిలేసి ఊరుకున్నారు. కాని పడవల యజమాని మటుకు వదిలి పెట్టలేదు; వాడి జీతం డబ్బులు కాజెయ్యటానికి మంచి అవకాశం చిక్కింది. అతను కొండ మనిషితో, "ఇదుగో, అబ్బీ, ఒక చిన్న పందెం వేస్తావా? రేపు మన పడవలు కొద్ది మైళ్ళ దూరంలో మరో గ్రామం వద్ద నిలుస్తాయి. అక్కడ నువు నీటిలోకి దిగి నీ కత్తిని పైకి తీస్తివా, నా పడవలన్నీ నీ కిచ్చేస్తాను; తీయలేక పోయావో నీ కూలి డబ్బులు వదులుకో! సరేనా?" అన్నాడు.




## 26

[బిడాలి, శ్వానకర్ణి ముఠాలకు 'రాజీ కుదిర్చేందుకు జయమల్లు చేసిన ప్రయత్నం ఫలించలేదు. శ్వానకర్ణి ముఠావాళ్ళ మూల పురుషుడి రాతి గద నిప్పులు కక్కే సింహం గుహలో వున్నదని బిడాలి చెప్పాడు. ఆ గద తెచ్చేందుకు కేశవుడూ, అతడి స్నేహితులు మడుగు దాటి సింహం గుహను సమీపించి, లోపలికి తొంగి చూశారు. తరవాత—]

గుహ లోపలి భాగం ఏమంత చీకటిగా లేదు. ఎక్కడినుంచో వెలుగు దానిలోకి పడుతున్నది. ఆ గుడ్డి వెలుగులో, అందరి కన్న ముందు నిలబడి గుహ లోపలికి తొంగి చూసిన కేశవుడికి, ఏవో నిప్పు రవ్వలు లేచి చెల్లా చెదరైనట్టు కనిపించింది.

"నిజంగా, గుహావాసులు చెప్పినట్టు లోపల వున్నది నిప్పులు కక్కే సింహమే అయితే, అది మన బాణం వేటు దూరంలోనే వున్నది," అంటూ కేశవుడు తన అనుచరుల కేసి చూశాడు. ఈలోపల జయమల్లూ, కోయగోమాంగ్ కూడా గుహలో రేగిన నిప్పు రవ్వలను గమనించారు.

"మనం సింహాన్ని బయిటికి వచ్చేట్టు చేయాలి. అలా చేయుగలిగామో దాన్ని చంపటం తేలిక. అలా కాక, మనం గుహలో ప్రవేశించటం ఏమంత క్షేమం కాదు," అన్నాడు జయమల్లు.



"సింహం మనను చూసి బెదురుకుని పారిపోయింది. సందేహం లేదు," అన్నాడు కోయగోమాంగ్.

"ఇక మనం గుహలోకి జొరబడి దాన్ని వెంటబడి తరిమి వేటాడటమే మార్గం, ఏమంటావ్, జయమల్లూ?" అని ప్రశ్నించాడు కేశవుడు.

జయమల్లు గుహ లోపలికి రెండడుగులు వేసి ఆగి, "గుహావాసులు చెప్పినంత భయంకర జంతువేమీ కాదు, ఈ సింహం! పోతే, తతిమ్మా సింహాల్లో లేని ప్రత్యేకత దీని కొకటి వుంది. అది, ముక్కుల్లో నుంచో, నోట్లో నుంచో నిప్పు రవ్వలు రాల్చటం. అది చూసే గుహావాసులు అంత భయపడి పోయారు. సరే, జాగ్రత్తగా నడవండి. మనం వదిలే మూడు విష బాణాల్లో ఏ ఒక్కటి తగిలినా సింహం చచ్చినదాని కిందే లెక్క. అంతేనా గోమాంగ్?" అన్నాడు.

"ఆ విషం సంగతి నాకు బాగా తెలుసు. నీ కెలాంటి సంశయం అక్కర లేదు," అన్నాడు కోయగోమాంగ్ నమ్మకంగా.

ముగ్గురూ గుహ ప్రవేశించి ముందుకు నడవసాగారు. కొంత దూరం లోపలికి పోయేసరికి, వాళ్ళకు గుహ రెండు మూడు భాగాలుగా చీలి పోవటం కనిపించింది.

జయమల్లు యిలా అంటూ వుండగానే, కోయగోమాంగ్ గుహ ముందున్న ఒక పెద్ద రాయి తీసుకుని బలంగా గుహలోకి విసురుతూ, 'ఏహొయ్!' అంటూ బిగ్గరగా అరిచాడు. ఆ ధ్వని గుహలో మారు మోగింది. ఆ వెంటనే లోపల నిప్పు రవ్వలు చేటలతో చెరిగినట్టు లేచినై.

కేశవుడు చప్పున బాణం ఎక్కు పెట్టి సూటిగా గుహలోకి వదులుతూ, "సింహం మన మీదికి దూకేందుకు వస్తున్నది," అంటూ హెచ్చరించాడు. కాని, మరుక్షణం గుహను నిశ్శబ్దం ఆవరించింది. నిప్పు రవ్వల కాంతి మాయమయింది.



అంతా వెలుగుగానే వున్నది. కాని, ఎక్కడా సింహం జాడలేదు.

"మళ్ళీ తిరిగి మనం గుహ కందరాల్లో పడ్డాం. ఏదారి ఎటు పోతుందో చెప్పలేం. సింహం, ఈ మార్గాల్లో దేనివెంట పారి పోయినట్టు?" అన్నాడు కేశవుడు.

కోయగోమాంగ్ మోకాళ్ళ మీద పాకుతూ గుహ చీలికలైన ప్రదేశాన్ని జాగ్రత్తగా పరీక్షించి చూసి, "సింహం, యిదుగో, ఈ కుడి వైపు సొరంగ మార్గాన పోయింది. యిక కదలండి," అంటూ బయలుదేరాడు.

జయమల్లు అతడి భుజం, పట్టుకుని ఆపుతూ, "గోమాంగ్, తొందరపడకు. నువ్వన్నట్టు సింహం ఆ మార్గానే పోయినా, అది ఏ మలుపో తిరిగి, వెనక్కు వచ్చి, మన మీద హఠాత్తుగా దూకవచ్చు. ఆ సంగతి ఆలోచించావా?" అన్నాడు.

జయమల్లు యిలా అనగానే, గోమాంగ్ ఆశ్చర్యం కనబరుస్తూ, "అవును, జయమల్లూ. నువ్వన్నది నిజమే. మనలో ఒకళ్ళు వెన్ను కాస్తూ వెనక్కు నడవటం మంచిది. అప్పుడు సింహం మన మీద దొంగ దెబ్బ తీయలేదు," అన్నాడు.

జయమల్లూ, గోమాంగ్ ముందు నడుస్తూండగా, కేశవుడు వెనక్కు తిరిగి నడుస్తూ వాళ్ళను అనుసరించాడు. ఆ విధంగా వాళ్ళు గుహ మార్గాల వెంట కొంతదూరం నడిచే సరికి హఠాత్తుగా గోమాంగ్, చిన్న కేక వేసి, "చూడండి! ఇదిగో, మనిషి పుర్రె. బహుశా యిది బిడాలి ముఠా వాడైన భాగ్‌మారా దయి వుంటుంది. వాడే గదా శ్వానకర్ణి వాళ్ళ గద తీసుకుని ఈ గుహలోకి ప్రవేశించింది," అన్నాడు.

జయమల్లు ఆగి, అంత దూరంలో వున్న పుర్రెను చేతికి తీసుకుని పరీక్షించి చూసి, "గోమాంగ్, నువ్వన్నట్టు యిది భాగ్‌మారాదే కావచ్చు. ఆ రాతి గద కూడా యీ దాపులనే ఎక్కడో వుంటుంది," అన్నాడు.



ముగ్గురూ సొరంగ మార్గంలో గద కోసం వెతకసాగారు. కేశవుడు వికటంగా నవ్వుతూ, ఒక మూల నుంచి దాదాపు నాలు గడుగుల పొడ వున్న ఒక రాతి ముక్కను, చివర గుండ్రంగా రాతి ముళ్ళతో వున్న దానిని పై కెత్తి, "ఇదేనా, అద్భుత శక్తు లున్న శ్వానకర్ణి మూల పురుషుడిగద!" అన్నాడు.

జయమల్లు ఆ రాతి ముక్కను పరీక్షించి చూసి, "ఇది రాతి గద అనే దాంట్లో సందేహం ఏమీ లేదు. అద్భుత శక్తుల మాట ఆ గుహవాసులకే తెలియాలి! సరే, వచ్చిన పని అయింది. యిక బయట పడ దామా?" అన్నాడు.



"సింహం మాటేమిటి?" అని అడిగాడు కేశవుడు.

"అవును, దాన్ని చంపుతామని మాట యిచ్చాంగదా, చంపకుండా ఎలా పోవటం?" అన్నాడు కోయగోమాంగ్.

జయమల్లు చిరునవ్వు నవ్వుతూ రాతి గదను కోయగోమాంగ్ చేతి కిచ్చి, "మనం సింహాన్ని చంపుతామని ఎవరికీ వాగ్దానం చెయ్యలేదు. రాతి గదను శ్వానకర్ణికి తెచ్చి యిస్తామని చెప్పాం. ఆ పని పూర్తయింది. సింహం సంగతి మనకెందుకు? అది ఎంత భయంకర మృగమో కూడా మనకు తెలియదు. అనవసరంగా దుస్సాహసం చెయ్యటం వివేకం కాదు," అంటూ కేశవుడి కేసి తిరిగాడు.

జయమల్లు అన్నదానికి కేశవుడు ఏదో జవాబు చెప్పబోయేంతలో, కోయగోమాంగ్ ఎగిరి గంతేసి, "నిప్పులు కక్కే సింహం! బాణాలు ఎక్కు పెట్టండి," అంటూ రాతి గదను పై కెత్తాడు.

సింహం హఠాత్తుగా ఒక మలుపు తిరిగి భయంకరంగా గర్జిస్తూ ముందుకు దూకింది. జయమల్లూ, కేశవుడూ బాణాలు ఎక్కు పెట్టే లోపల గోమాంగ్ తన చేతిలో వున్న రాతి గదతో, దాని తల మీద గట్టిగా ఒక





దెబ్బ కొట్టాడు. ఆ దెబ్బ తింటూనే సింహం చెంగున వెనుదిరిగి పరిగెత్తసాగింది. కేశవుడూ, జయమల్లూ వదిలిన బాణాలు దానికి తగలలేదు.

"దీనికి సింహమని ఎవరు పేరు పెట్టారో గాని, యిది సింహం కాదు; మా కోయ వాళ్ళు దీన్ని సింహలీక మంటారు. మా కొండ ప్రాంతాల కూడా యివి వున్నవి. దాని ముక్కు నుంచి వెలువడే రవ్వల్లో కాంతి వుంటుంది తప్ప; వేడిమి వుండదు," అన్నాడు కోయగోమాంగ్.

"దాని మెడా, మూతీ చూసిన వాడెవడూ అది అసలు సింహపు జాతి జంతువంటేనే నమ్మడు. పైగా, వట్టి పిరికి గొడ్డులా వున్నది. అయినా, ఈ వర్ణనంతా యిప్పు డెందుకు. ఎదురయింది గనక, దాని అంతు తేల్చుదాం," అంటూ జయమల్లు ముందుకు పరిగెత్తాడు.

సింహం గుహ మార్గాన కొంత దూరం సూటిగా పరిగెత్తి, ఒక మలుపు తిరిగింది. జయమల్లు మలుపు సమీపిస్తూనే వేగం తగ్గించి, ముందుకు తొంగి చూసి పెద్దగా నవ్వుతూ, "ఇదేదో మన కోసం యిక్కడ పొంచి వుంటుందని భయపడ్డాను. కాని, అంతు లేకుండా పారిపోయింది. యిప్పు డేమిటి చేయటం?" అన్నాడు.

కేశవుడూ, కోయగోమాంగ్‌లు జయ మల్లును సమీపించి, ముందున్న సొరంగం కేసి చూశారు. గోమాంగ్ రాతి గదను రెండు చేతులతో పట్టుకుని పైకెత్తి అటూ యిటూ ఊపుతూ, "దీనిలో ఏదో అద్భుత శక్తి వున్నది, సందేహం లేదు. ఒక్క దెబ్బకే ఆ సింహలీకం ఎంత బెదిరి పోయిందో చూశారుగదా?" అన్నాడు.

"ఇక వెనక్కు తిరిగి పోవటమే మంచి దేమో," అన్నాడు జయమల్లు.

"ఇంత శ్రమపడి వూరికే పోవటం ఎందుకు. ఆ సింహాన్ని చంపి దాని చర్మం

వలుచుకుపోదాం," అన్నాడు కేశవుడు. ముగ్గురూ గుహ మార్గం వెంట నడవసాగారు. కాని ఎక్కడా సింహం జాడ లేదు. అది మరే గుహ మార్గంలోనో దాక్కుని వుంటుందని వాళ్ళు భావించారు. కాని, యిన్ని సొరంగపు బాటల్లో దాన్ని వెతికి చంపటం ఎలా?

జయమల్లు వెనక్కు తిరిగి నడవబోయినవాడల్లా చప్పున ఆగి, "మనం వచ్చిన మార్గానే తిరిగి నీటి మడుగు దగ్గరకు వెళ్ళేందుకు, దారి మీకు గుర్తుందా? లోగడ మనం గుహ కందరాల్లో దారి తప్పినట్టే, మళ్ళీ దారి తప్పంగదా!" అన్నాడు.

ఆ ప్రశ్నతోగాని అందరికీ తాము చేసిన పొరపాటు తెలిసి రాలేదు. సింహాన్ని చంపాలన్న ఉత్సాహంలో ఎటు పోతున్నదీ గుర్తుపెట్టుకోకుండానే ముగ్గురూ సొరంగ మార్గాల వెంట పరిగెత్తారు. ఇప్పుడు ఏ మార్గాన వెళితే, తాము గుహవాసులుండే ప్రాంతాలకు చేరగలరో వాళ్ళకు అర్థంకాలేదు.

"మనం తొందరపడి ఏదో ఒక సొరంగ మార్గాన్ని పట్టి, దారి తెలియక తరవాత గందరగోళ పడటం మంచిది కాదు. ముందుగా మనం నీటి మడుగుకు ఎంత దూరంలో వున్నామో గ్రహించ గలిగితే బావుంటుంది," అన్నాడు జయమల్లు.



"ఆ సంగతి గ్రహించటం ఎలా?" అన్నాడు కేశవుడు.

జయమల్లు జవాబు చెప్పబోయేంతలో, కోయగోమాంగ్ అక్కడ ఎగుడు దిగుడుగా వున్న రాళ్ళమీంచి పైకి పాకి, ఒక కంతలో నుంచి తల దూర్చి బయిటికి తొంగి చూస్తూనే, "హాఁ తల్లీ, కొనలమ్మా!" అంటూ మూలిగి, కాసేపు ఆశ్చర్యంగా తల పంకించి, చప్పున కిందికి దూకాడు.

"ఏమిటంత ఆశ్చర్య పడ్డావ్? ఏం కనబడింది?" అని జయమల్లు, గోమాంగ్‌ను ప్రశ్నించాడు. గోమాంగ్ మెల్లిగా మాట్టాడమన్నట్టు అందరికీ సౌంజ్ఞ చేసి, "మనం

తిరిగీ ప్రమాదాల్లో తల దూర్చాం. గుహ కందరాల్లో పడి మనం రెక్కల మనుషు లుండే ప్రాంతం చేరటమేగాక, బ్రహ్మ దండి మాంత్రికుడికూడా చేరువ అయ్యాం," అన్నాడు.

బ్రహ్మదండి మాంత్రికుడి పేరు వింటూనే కేశవుడికీ, జయమల్లుకూ కలిగిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. వాళ్ళిద్దరూ, గోమాంగ్ ఎక్కి చూసిన కంత దగ్గిరకు పోతున్నంతలో, గోమాంగ్ వాళ్ళను హెచ్చ రిస్తూ, "మీరు తొందరపడి ఏదన్నా చేసి, మనం వున్న ప్రాంతం వాళ్ళకు తెలిసేలా చేయకండి. రెక్కల మనుషులు బ్రహ్మ దండి మాంత్రికుడి ముందు వ్యాయామ ప్రదర్శనలు చేస్తున్నట్టున్నది," అన్నాడు.

కేశవుడూ, జయమల్లూ నిశ్శబ్దంగా పైకి పాకి కంతలో నుంచి బయిటికి తొంగి చూశారు. ఎదురుగా ఒక పెద్ద మైదానం, పెద్ద పెద్ద వృక్షాలు. వాటి మీది నుంచి అనేక మంది రెక్కల మనుషులు పక్షుల్లా ఎగిరి కిందికి దూకుతున్నారు. అక్కడ వున్న ఒక ఎత్తయిన రాతి ఆసనం మీద బ్రహ్మదండి మాంత్రికుడు కూచుని వుండి, చేతిలో గల మంత్రదండాన్ని అటూ యిటూ ఊపుతున్నాడు.

"ఈసారి వీణ్ణి ప్రాణాలతో పోనివ్వ కూడదు, చిత్రవధ చేయాలిసిందే," అన్నాడు కేశవుడు రోషంగా.

జయమల్లు తల వూపి ఏమో చెప్ప బోయేంతలో, రెక్కల మనుషులు ఒక్క సారిగా హాహాకారాలు చేసి, చెల్లా చెదరుగా పారిపోసాగారు. బ్రహ్మదండి ఎగిరి రాతి మీద నిలబడి మంత్రదండాన్ని గాలిలో ఊపుతూ, "అం హుం ఫట్ ఘుట్... కాల భైరవా..." అంటూ కేకలు ప్రారం భించాడు. నిప్పులు కక్కే సింహం పారి పోతున్న రెక్కల మనుషుల కేసి వేగంగా పరిగెత్తుతున్నది. —(ఇంకా వుంది)





# దుష్టులతో సహవాసం

విసుగుచెందని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ పట్టుదలకు సంతోషమేగాని, నీవు దుష్టుల సాంగత్యం కారణంగా ఈ పనికి పూనుకున్నావేమోనని నాకు సందేహంగా ఉన్నది. నీలాగే సాహసి అయిన సమయస్ఫూర్తి అనే యువకుడు పిశాచాల సాంగత్యం చేసి పెద్ద చిక్కులో పడ్డాడు. శ్రమ తెలియకుండా ఉండగలందులకు నీకు అతడి కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

దక్షిణాన కన్యాకుమారికి కొద్ది దూరంలో సమయస్ఫూర్తి అనే ఒక భూస్వామి కొడుకుండేవాడు. వాడు అమిత సాహసి, తనకు తోచిన పని ముందు వెనుక లాలోచించకుండా చేసేవాడు, పట్టు బడితే బ్రహ్మరుద్రులు వచ్చి చెప్పినా మానేవాడుకాడు.

## బేతాళ కథలు



ఒకనాటి రాత్రి సమయస్ఫూర్తికీ అతడి తండ్రికీ వాగ్వాదం జరిగింది. అతడికి తండ్రి పైన పట్టరాని ఆగ్రహం వచ్చింది. అందు చేత వాడు అప్పటికప్పుడే ఇల్లు విడిచి ఎక్కడికైనా వెళ్ళి పోవాలని బయలు దేరాడు. వాడు సముద్రతీరానికి సమీపంలో ఉండే ఒక గుట్ట పైన కూర్చుని కర్తవ్యం ఆలోచించాడు. కనుచూపు మేరలో మనుష్యులెవరూ లేరు. ఆకాశాన చంద్రుడు మబ్బుల మధ్యగా పరిగెత్తి పోతున్నట్టు కనిపించింది. తాను కూడా సముద్రం దాటి దేశాంతరాలకు పోతే బాగుంటుందని సమయస్ఫూర్తికి అనిపించింది.

అది తనకు ఎలా సాధ్యమవుతుందా అని వాడు ఆలోచిస్తూండగా దూరాన కలకలం వినిపించింది. త్వరలోనే కొన్ని పిశాచాలు వాడు కూచుని ఉన్న గుట్ట పక్కగా సముద్రానికి దగ్గిరలో ఉన్న ఒక పెద్ద గుట్ట కేసి వెళ్ళాయి. సమయస్ఫూర్తి ముందు వెనుక లాలోచించకుండా ఆ పిశాచాల వెంట తాను కూడా పరిగెత్తాడు.

పిశాచాలన్నీ ఒక చోట కూడాయి. "నాకో గుర్రం! నాకో జీను!" అని పిశాచాలు అరవటమూ, వాటి ముందు గుర్రాలు జీనులతో సహా ప్రత్యక్షం కావటమూ చూసి సమయస్ఫూర్తి కూడా, "నాకో గుర్రం! నాకో జీను!" అని అరిచాడు. వెంటనే వాడి ముందు కూడా ఒక మంచి గుర్రం జీనుతో సహా నిలబడింది. వాడు వెంటనే దాని నెక్కి కూచుని చుట్టూ కలయ చూసేసరికి పిశాచాలన్నీ గుర్రాల మీద ఎక్కి ఉండటం వాడికి కనబడింది.

సమయస్ఫూర్తి సమీపంలోనే ఒక గుర్ర మెక్కి ఉన్న ముసలి పిశాచి, "ఏం, సమయస్ఫూర్తీ? నీవు కూడా మాతో వస్తున్నావా?" అని అడిగాడు.

"తప్పకుండా వస్తున్నాను," అన్నాడు సమయస్ఫూర్తి.

"అయితే మరి పద!" అన్నాడు పిశాచి. గుర్రా లన్నీ సముద్రపు టొడ్డు కేసి వేగంగా పరిగెత్తాయి. ఒక్కొక్క గుర్రమే నీటి దగ్గిరికి రాగానే దానిపై నున్న పిశాచి, "అవతలి గట్టుకు!" అని కేక పెట్టటమూ, గుర్రం ఆకాశంలోకి ఎగరటమూ జరిగింది. సమయస్ఫూర్తి కూడా, "అవతలి గట్టుకు!" అని అరిచి, గుర్రంతో సహా గాలిలోకి లేచాడు. కన్ను మూసి కన్ను తెరిచే లోపుగా గుర్రా లన్నీ అవతలి తీరాన ఉన్నాయి.

"సమయస్ఫూర్తీ, ఇదే దేశమో నీకు తెలుసా?" అన్నాడు ముసలి పిశాచి.

"నాకు తెలియదు," అన్నాడు సమయస్ఫూర్తి.

"ఇది లంక. ఈ రాత్రి లంకరాజు కూతురి వివాహం జరుగుతున్నది. అంతటి అందగత్తె మూడు లోకాలలోనూ లేదు. ఆమెను ఎత్తుకు రావటానికి మనమిప్పుడు పోతున్నాం. నీవు రావటం మంచిదే అయింది. ఎందుకంటే తిరిగి వచ్చేటప్పుడు ఆమెను నీ వెనక గుర్రం మీద కూచో బెడతాం. ఆమె నిన్ను పట్టుకోగలుగుతుంది. మేము మనుషులం కాము గనక ఆమెకు మా నుంచి పట్టు చిక్కదు. మాలో ఎవరి వెంట నన్నా గుర్ర మెక్కితే కింద పడి



పోవచ్చు. ఇది నీకు సమ్మతమేనా? మేము చేప్పినట్టు చేస్తావా?" అని ముసలి పిశాచి అడిగాడు.

సమయస్ఫూర్తి ముందు వెనుక లాలో చించకుండా, "ఎందుకు సమ్మతం కాదూ? మీరు చెయ్యమన్నదల్లా చేస్తాను!" అన్నాడు. అందరూ గుర్రాలు దిగారు. ఒక పిశాచి ఏదో మంత్రం ఉచ్చరించింది. మరుక్షణం సమయస్ఫూర్తితో సహా పిశాచా లన్నీ రాజభవనంలో ఉన్నాయి.

రాజభవనం దేదీప్యమానంగా దీపాలతో వెలిగి పోతున్నది. ఖరీదైన దుస్తులూ, ధగధగలాడే ఆభరణాలూ ధరించి రక

రకాల రాజులూ, రాజకుమారులూ, స్త్రీలూ విందు చేస్తున్నారు. సమయస్ఫూర్తి అంత వైభవాన్ని కలలో కూడా ఊహించుకో లేదు. అది వాడికి స్వర్గం లాగుంది. అక్కడ విని పించే సంగీతం గంధర్వగానం లాగున్నది. నృత్యాలు అప్సరసల నృత్యాల లాగున్నాయి.

లంకరాజు హయాములో ఇదే మొట్ట మొదటి అక్కర కావటం చేత ఆయన అంతులేని డబ్బు ఖర్చు చేసి ఈ పెళ్ళి ఏర్పాట్లు చేయించాడు. అదీగాక రాజుకు ఈ ఒక్క కుమార్తె తప్ప వేరే సంతానం లేదు. ఆమెను పొరుగు రాజు కిచ్చి వివాహం చేస్తున్నారు.

అక్కడ ఉన్న అతిథు లెవరూ పిశాచా లనుగాని, వారి వెంట ఉన్న సమయ స్ఫూర్తినిగాని చూడలేదు. అందుచేత వారి విందు వినోదాలకు పిశాచాల రాక ఎలాటి అంతరాయమూ కలిగించలేదు.

"ఇంతకూ పెళ్ళి కూతురెవరు?" అని సమయస్ఫూర్తి ముసలి పిశాచిని అడిగాడు.

"అదుగో, కల్యాణం బొట్టు పెట్టుకుని వధువు వేషంలో కనిపించటం లేదా?" అన్నాడు పిశాచి.

పిశాచి చూపిన దిక్కుగా చూసి సమయ స్ఫూర్తి నిర్ఘాంతపోయాడు. పెళ్ళికూతురు అద్భుత సౌందర్యవతి. ప్రపంచంలో అంత



అందగత్తె లుంటారని వాడు ఊహించనైనా లేదు. ఆమె ధరించిన చీరె జరీ ముద్ద. ఆమె చేతి వేలిన ఉన్న ఉంగరంలోని రత్నం నక్షత్రంలాగా ప్రకాశిస్తున్నది. మొదట సమయస్ఫూర్తికి ఆమెను చూసి కళ్ళు చెదిరి నట్టయింది, కాని కొంచెం పరికించి చూస్తే ఆమె కళ్ళలో అశ్రువు లున్నట్టు వాడికి అనుమానం కలిగింది.

"అందరూ ఇంత ఉత్సాహంగా ఉంటే పెళ్ళికూతురు కంట తడి ఎందుకో?" అన్నాడు సమయస్ఫూర్తి.

"ఎందుకా? ఆ పెళ్ళి కొడుకంటే ఆమె కిష్టం లేదు గనక! ఈ సంబంధం మూడేళ్ళ క్రితమే తండ్రి నిశ్చయించాడు. అప్పటి కామెకు పదిహేనేళ్ళు. తనకా సంబంధం ఇష్టం లేదని తండ్రితో చెప్పలేక ఆమె తన కింత చిన్నతనంలో పెళ్ళాడటం ఇష్టం లేదన్నది. ఆ మరుసటి ఏడూ, దాని తరువాత ఏడూ కూడా ఆమె తన వివాహాన్ని ఇలాగే వాయిదా వేసింది. ఈ యేడు రాజు పట్టుబట్టి ఆమెకు పెళ్ళి చేస్తున్నాడు. ఆమె మనసు మార్చుకోలేక లోపల లోపల కుళ్ళు తున్నది. ఆమె కష్టాలు మనం తీర్చబోతున్నాం. ఏ రాజు కొడుకూ ఆమెను పెళ్ళాడకుండా చూడటానికే మనం వచ్చాం!" అన్నాడు పిశాచి.





సమయస్ఫూర్తికి రాజకుమార్తె పరిస్థితి తలుచుకుంటే గుండె ద్రవించి పోయింది. ఆమె తన కిష్టం లేని భర్త నుంచి విముక్తి పొందుతున్నదన్న మాటేగాని ఈ పిశాచాల పాలపడబోతున్నది. అభాగ్యురాలు! తాను ఈ పిశాచాల వెంట రాకుండా ఉంటే బాగుండేదనిపించింది. ఆమెను తన వారి నుంచీ, తన దేశం నుంచీ వేరు చెయ్యటంలో సమయస్ఫూర్తికి కూడా భాగం ఉంటుంది. అది వాడికి ఏమాత్రమూ నచ్చలేదు.

వాడు పైకి ఏమీ అనకపోయినా తనలో మటుకు, "ఈమెను ఎలాగైనా రక్షిస్తే బాగుండును! రక్షించ గలిగితే నా ప్రాణాలైనా ఇద్దును! కాని నా చేతిలో ఏముంది?" అనుకున్నాడు.

విందు పూర్తి అయింది. పెళ్ళికూతురూ, పెళ్ళికొడుకూ వివాహ వేదిక వద్దకు నడుస్తూ వచ్చారు. వారి వెంట రాజూ, రాణీ కూడా ఉన్నారు. వారు పిశాచాల పక్కగా వెళుతూండగా ఒక పిశాచి పెళ్ళికూతురికి తన కాలు అడ్డు పెట్టాడు. పెళ్ళికూతురు పడిపోయింది. వెంటనే మరొక పిశాచి ఆమె పైన ఏదో కప్పింది. అక్కడ ఉన్న వాళ్ళు పెళ్ళికూతురును మరి చూడలేదు.

పెళ్ళి ఇల్లు ఒక్క క్షణంలో కోలాహలంతో నిండిపోయింది. "పెళ్ళికూతురు ఏదీ? కనిపించదేం? ఇప్పుడిక్కడ పడిపోయిన మనిషి ఇంతలో ఎలా మాయమయింది?" అని కేకలు సాగాయి.

ఈలోపుగా పిశాచాలు అదృశ్యమైన పెళ్ళికూతురును మోసుకుని గుర్రాలున్న చోటికి చేరారు.

పిశాచాలతోబాటు సమయస్ఫూర్తి కూడా, "నా గుర్రం! నా జీను!" అని అరిచాడు. వాడి ముందు గుర్రం నిలిచింది.

"వెంటనే ఎక్కి కూచో, సమయస్ఫూర్తీ! ఈమెను నీ వెనుక ఎక్కించుకో!" అన్నాడు ముసలి పిశాచి.

సమయస్ఫూర్తి రాజకుమార్తెను గుర్రం మీదికి ఎక్కించి, తాను ఆమె ముందు జీనులో ఎగిరి కూచున్నాడు. గుర్రాలన్నీ మళ్ళీ సముద్రం కేసి పరిగెత్తాయి. "అవతలి ఒడ్డుకు!" అనగానే అవి సముద్రాన్ని లంఘించి, బయలుదేరిన చోటికి వచ్చి చేరాయి.

సరిగా ఆ క్షణంలో సమయస్ఫూర్తికి ఒక ఆలోచన స్ఫురించింది. వాడు రాజకుమార్తెతో సహా గుర్రం మీది నుంచి దూకి పిశాచాలతో, "మా దగ్గిరికి రాకండి! మమ్మల్ని అంటకండి! జై వీరహనుమాన్!" అంటూ ఆంజనేయ స్తవం చదివాడు.

పిశాచాలు అంత దూరానే ఉండి, "మా వెంట రానిచ్చినందుకు ఈ పని చేస్తావా? దీనికి నీవు పశ్చాత్తాప పడకపోవులే! అనుభవిస్తావు చూస్తూ ఉండు!" అన్నాయి. తరవాత పిశాచాలు వాళ్ళను వదిలి తమ దారిన వెళ్ళి పోయాయి.

"అమ్మయ్య! పిశాచాల పీడ విరగడ అయింది. వాళ్ళ పాల పడటం కంటె నా వెంట ఉండటమే నీకు మేలు. కాదూ?" అని సమయస్ఫూర్తి రాజకుమార్తెను ప్రశ్నించాడు. ఆ ప్రశ్నకు రాజకుమార్తె జవాబు చెప్పలేదు.



"నీ బాధ నాకు తెలుసును. ఏమైనా ఈ రాత్రికి నీవు మా యింట తల దాచుకోక తప్పదు. నన్ను నీ భృత్యుడుగా భావించి నీకేమి కావాలో చెప్పు," అన్నాడు సమయస్ఫూర్తి.

దానికి కూడా ఆమె జవాబు చెప్పలేదు.

"అమ్మాయీ, నాతో మాట్లాడటానికి సందేహించకు. నేను నిన్నెత్తుకు వచ్చిన పిశాచాలలో ఒకణ్ణి కాను. నేను మామూలు మనిషిని. మా నాన్న భూస్వామి. కావాలంటే నిన్ను మీ యింటికి ఎలాగో చేర్చుతాను. దయచేసి నీ కోరిక ఏమిటో చెప్పు," అన్నాడు సమయస్ఫూర్తి.



అమె ఏదో మాట్లాడ యత్నించింది గాని నోట మాట రాలేదు. పిశాచాలు ఆమెను మూగదాన్ని చేసినట్టు సమయస్ఫూర్తికి అర్థమయింది. అసలే ఆమెను చూసి జాలి పడుతున్న వాడికి ఇది చూసి కళ్ళు చెమ్మగిల్లాయి. ఆమెను తమ ఇంటికి తీసుకుపోయి లాభం ఉండదు. ఆమె లంకరాజు కూతురనీ, తాను ఆ రాత్రి పిశాచాల వెంట లంకకు వెళ్ళాననీ, పిశాచాలు ఆమెను తెచ్చాయనీ అంటే ఒక్కరూ నమ్మరు. పైగా తన స్థితి నవ్వుల పాలవుతుంది. అందుచేత వాడు తెల్లవారే లోపుగా ఆమెను తనకు తెలిసిన పూజారి ఇంటికి చేర్చి, అక్కడ ఆమెను గోప్యంగా ఉంచి, జరగవలిసిన దాన్ని గురించి తాపీగా ఆలోచింతామనుకున్నాడు. ఈ ఆలోచన వాడు ఆమెకు చెప్పి సమ్మతమేనా అని అడిగితే సమ్మతమే నన్నట్టు ఆమె తల ఆడించింది.

ఇద్దరూ కలిసి పూజారి ఇంటికి వెళ్ళారు. చాలాసేపు తలుపు తట్టిన మీదట పూజారి నిద్ర లేచి తలుపు తీశాడు. సమయస్ఫూర్తి ఆయనకు జరిగినదంతా చెప్పి, "ప్రస్తుతానికి ఈమెను మీ ఇంట రహస్యంగా దాచి ఉంచాలి," అన్నాడు.

పూజారి సమయస్ఫూర్తి నుంచి ఎన్నో సార్లు ఉపకారం పొంది ఉన్నాడు. అందుచేత ఆయన, "ఈమెను నీ యిష్టం వచ్చినంత కాలం మా యింట ఉంచు. కాని ఎప్పటికైనా ఆమెను తండ్రి వద్దకు పంపవలిసిందే గాని మార్గాంతరం నాకు తోచటం లేదు," అన్నాడు.

"ఆ విషయం నాకూ ఏమీ పాలుపోవటం లేదు. ప్రస్తుతానికి ఇంత కంటె చేయ దగినది ఏమీ లేదు," అన్నాడు సమయస్ఫూర్తి.

మర్నాడు పూజారి తన ఇరుగు పొరుగు వారితో ఆ పిల్ల తన అన్న కూతురనీ, మూగదనీ, తలవని తలంపుగా వచ్చిందనీ

చెప్పాడు. ఈ మాటలు ఎవరూ విశ్వసించ లేదు, కాని నిజం తెలుసుకోవటం వారికి సాధ్యం కాలేదు. సమయస్ఫూర్తి రోజూ పూజారి ఇంటికి వెళ్ళి వస్తూండేవాడు.

ఆరోజు కారోజు సమయస్ఫూర్తికి రాజకుమార్తె పై ప్రేమ వృద్ధి అవుతూ వచ్చింది. ఆమెకు కూడా అతనంటే ఇష్టం ఉన్నట్టే కనబడింది. కాని ఆమె మూగది. అందు చేత పరిస్థితిలో ఏమీ మార్పు కలగలేదు.

ఇలా ఒక్కొక్క నెలే గడిచి సంవత్సరం నిండింది. ఒకనాటి సాయంకాలం సమయస్ఫూర్తికి అకస్మాత్తుగా జ్ఞాపకం వచ్చింది: సరిగా ఏడాది క్రితం ఈ రోజునే తాను పిశాచాల వెంట లంకకు వెళ్ళాడు. ఈ రోజు పిశాచాలు మళ్ళీ గుట్టల వద్దకు రావచ్చు. రాజకుమార్తె మూగతనం పోయే ఉపాయం వారి నుంచి ఏ మాయోపాయం చేతనైనా రాబట్ట వచ్చు!

ఈ ఆశతో వాడు ఆ రాత్రి గుట్టల కేసి వెళ్ళి, అక్కడ పిశాచాల కోసరం గంటల తరబడి వేచి ఉన్నాడు. అవి రావని నిర్ధారణ చేసుకుని వాడు ఇంటికి పోదామను కుంటూండగా పిశాచాలు వస్తున్న సవ్వడి వినిపించింది.

పిశాచాలు తమ ప్రదేశంలో చేరి, "నా గుర్రం! నా జీను!" అని అరవసాగాయి.





సమయస్ఫూర్తి కూడా, "నా గుర్రం! నా జీను!" అని అరిచాడు.

ముసలి పిశాచి వాడి దగ్గిరికి వచ్చి, "మళ్ళీ వచ్చావా, సమయస్ఫూర్తీ? కిందటేడు మమ్మల్ని అలా మోసం చేశాక నీకు మళ్ళీ గుర్రమూ, జీనూనా? ఏమంటుంది నీ భార్య?" అన్నాడు వెటకారంగా.

"నోరు పడిపోయిన మనిషి ఏమంటుందిలే!" అని మరొక పిశాచి వేళాకోళం చేశాడు.

"మనిషిని చూసుకుని మురిసి పోవలసిందేగాని, మాటా పలుకూ అడటానికి లేదు," అన్నాడు మూడో పిశాచి.

"వెర్రివాడు! ఆ పిల్ల మూగతనం పోగొట్టే మూలిక తన వాకిలి ముందే ఉన్నది. దాని ఆకులు తుంచి, పాలు పిండి, నీళ్ళతో మరిగించి తాగిస్తే ఆ పిల్లకు ఎప్పుడో మాటలు వచ్చేవి!" అన్నాడు మరొక పిశాచి.

"వాడితో మన కేమిటి? మన దారిన మనం పోదాం పదండి," అన్నాయి మిగిలిన పిశాచాలు.

పిశాచాలు తమ గుర్రాల పైన వెళ్ళి పోయాక సమయస్ఫూర్తి ఇంటికి తిరిగి వచ్చాడు. తన గడప దగ్గిరే ఒక మూలిక ఉన్నదనీ, దాని పాలతో మందు తయారు చేసి తాగిస్తే రాజకుమార్తె మూగ తనం పోతుందనీ వాడికి నమ్మకం లేదు. అదే నిజమైతే పిశాచాలు చెప్పవని వాడికి తెలుసు.

వాడు ఇంటికి వెళ్ళి పడుకున్నాడేగాని కన్ను మూయలేదు. తెల్లవారుతూనే లేచి వాడు తన ఇంటి గడప దగ్గిరికి వెళ్ళాడు. గడపకు అంత దూరంలో గోడ నానుకొని నిజంగానే ఒక చిత్రమైన మొక్క కనిపించింది. దాన్ని వాడెన్నడూ చూడలేదు. దానికి ఏడు రెమ్మలే ఉండటమూ, రెమ్మకు ఏడేసి ఆకు లుండటమూ చూస్తే అది ఏదో ఓషధి అయి ఉండాలని వాడికి తోచింది.

వాడు ఆత్రంగా ఆ మొక్కను తవ్వి లోపలికి తీసుకుపోయి దాని ఆకులు గిల్లాడు. ఆ గిల్లిన ఆకుల నుంచీ, కాడల నుంచీ, తెల్లటి పాలు కారాయి. ఆ పాలను ఒక లోటాలోకి పట్టి, నీళ్ళతో చేర్చి మరిగించగా నూనె లాటి కషాయం దిగింది. ఎందుకైనా మంచిదని వాడు అందులో సగం తాగాడు. వెంటనే వాడికి నిద్ర మత్తు వచ్చేసింది. మర్నాడు ఉదయం దాకా వాడు ఆ నిద్ర నుంచి మేలుకో లేదు. మేలుకున్నాక మనసు నిర్మలంగా ఉంది, శరీరం శక్తి వంతంగా ఉన్నట్టు తోచింది. మందు వల్ల అవలక్షణాలేవీ లేవు.

అప్పుడు ధైర్యం వచ్చి సమయస్ఫూర్తి తాను తాగగా మిగిలిన కషాయం తీసుకుని పూజారి ఇంటికి వెళ్ళాడు.

రెండు రోజులుగా వాడు కనపడక పోవటంచేత పూజారీ, రాజకుమార్తె కూడా ఏమి జరిగిందోనని భయపడ్డారు. వారితో జరిగిన సంగతి చెప్పి సమయస్ఫూర్తి రాజ కుమార్తె చేత తాను తెచ్చిన కషాయం తాగించాడు. ఆమెకు వెంటనే నిద్రపట్టింది.

ఆ నిద్ర నుంచి ఆమెకు మర్నాడు ఉదయం దాకా మెలకువ రాలేదు. నిద్ర మేలుకుంటూనే ఆమె మామూలుగా



మాట్లాడింది. ఆమెకు కూడా తన పైన ప్రేమ ఉన్నదని ఆమె ద్వారా విన్నాక సమయస్ఫూర్తి ఆమెను పెళ్ళాడటానికి నిశ్చయించాడు. వాడు జరిగిన సంగతి యావత్తూ తండ్రికి చెప్పాడు. తన కొడుకు ప్రయోజకత్వం విని సంతోషించి తండ్రి వాళ్ళిద్దరికీ వైభవంగా పెళ్ళి చేశాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నా కొక సందేహం. తమను మోసగించి రాజ కుమార్తెను తమకు దక్కకుండా చేసిన సమయస్ఫూర్తి పై కక్ష పట్టి పిశాచాలు రాజకుమార్తెను మూగదాన్ని చెయ్యటం సహజంగానే ఉంది. కాని వారు చివరకు

అతనికి చికిత్స ఎందుకు చెప్పారు? పిశాచాలు తాము చేసిన పనికి పశ్చాత్తాప పడ్డారా? లేక వారికి లంకరాజు కూతురుపై భ్రమ తగ్గిందా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ఈ సందేశం అపోహ వల్ల కలిగినది. పిశాచాలు మొదటి నుంచీ రాజకుమార్తెను సమయస్ఫూర్తికే ఉద్దేశించాయి. ముసలి పిశాచి పిశాచాలకు నాయకుడై ఉంటాడు. వాడు మొదటి నుంచీ సమయస్ఫూర్తి పట్ల ఆసక్తి కనబరుస్తూనే వచ్చాడు. పిశాచాలు, సమయస్ఫూర్తికి కనిపించటమూ, రాజకుమార్తెను వాడి గుర్రం పైనే ఎక్కించటమూ మొదలైనవి యాదృచ్ఛికంగా జరిగినవి కావు. ముసలి పిశాచి రాజకుమార్తెను తమ కోసం ఎత్తుకు వస్తున్నట్టు చెప్పలేదు. ఏ రాజకుమారుడూ ఆమెను పెళ్ళాడకుండా చేస్తామని మాత్రమే అన్నాడు. వారి నుంచి రాజకుమార్తెను కాపాడాననుకోవటంలో సమయస్ఫూర్తి భ్రమ పడ్డాడు. పిశాచాలు రాజకుమార్తెకు ఏడాదిపాటు మూగతనం కలిగించటంలో కూడా కక్ష ఏమీ లేదు. ఆమె సమయస్ఫూర్తిని ప్రేమించటం నేర్చుకోవటానికి ఆపాటి వ్యవధి అవసరం. ఎందుకంటే వారిద్దరి మధ్యా గల వ్యత్యాసం హెచ్చు: ఆమె రాజకుమార్తె, వాడు భూస్వామి కొడుకు. చికిత్సకు అవసరమైన మూలికను కూడా పిశాచాలే ప్రసాదించాయన వచ్చు. తన గడప వద్దనే ఉన్న ఆ మూలికను సమయస్ఫూర్తి ఎన్నడూ చూడలేదు. ఈ కారణాలను బట్టి పిశాచాల ప్రవర్తన మొదటి నుంచి కడవరకూ ఒకే విధంగా ఉన్నది," అన్నాడు.

రాజుకీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# పొడుపు కథ

భీమన్న మామగారి జమీ వసంతదేశంలో ఉన్నది. ఆ దేశపు యువరాజుగారు ఒక సందర్భంలో పర్యటన చేస్తూ ఆ వైపులకు రావటం తటస్థించింది. వారు జమీందారు గారి ఇంట ఒక రోజు అతిథిగా ఉంటారని ముందుగా కబురు వచ్చింది.

జమీందారుగారు యువరాజాగారి ఆతిథ్యం కోసం ఘనమైన ఏర్పాట్లు చేయించారు. ఈ ఏర్పాట్లు అమలు చెయ్యటానికి అనేకమంది మనుషులను నియోగించారు. యువరాజాగారి భోజన స్నాన పానాదుల ఏర్పాట్లు చూసే పని మహాలక్ష్మి పైన పడింది. యువరాజాగారు వచ్చి చేరగానే ఆయనకు ఎదురు వెళ్ళి, స్వాగతం చెప్పి యింటిలోపలికి తీసుకు వచ్చే పని భీమన్నకు ఇచ్చారు.

భీమన్నతో జమీందారుగారు, "యువరాజాగారు నీ వయసువాడు, నిన్నే పోలి ఉంటాడు. నేనేమో ముసలివాణ్ణి. నేను స్వాగతం చెప్పేకన్న నీవు చెప్పటం చాలా ఉచితంగా ఉంటుంది. యువరాజావారు కూడా చాలా సంతోషిస్తారు," అన్నాడు.

యువరాజాగారిని చూడగానే ఎలా నమస్కరించాలో, ఎలా స్వాగతం చెప్పాలో, ఎలా కుశల ప్రశ్న చెయ్యాలో జమీందారు గారు అల్లుడికి చక్కగా నూరి పోశారు. ఈ పని అయినాక భీమన్నకు తగిన దుస్తులు వేశారు. చమ్కీ లాగూ, చమ్కీ అంగరఖా, నెత్తి మీద చమ్కీ టోపీ, మెడలో పూసల దండలూ భీమన్న చేత ధరింప జేసి అతన్ని సిద్ధపరిచారు.

ఎప్పుడు యువరాజా వస్తాడా, ఎప్పుడు స్వాగతం చెబుదామా అని తహతహ లాడుతూ భీమన్న కాలు గాలిన పిల్లిలాగా అటూ ఇటూ తిరుగుతూ, తన కొత్త దుస్తులకు శరీరాన్ని అలవాటు చేసుకోసాగాడు.

ఇలాపచారు చేస్తూ భీమన్న హాలులోకి అడుగు పెట్టి ఆశ్చర్యంతో నిలిచిపోయాడు. ఎందుకంటే ఎదురుగా ఉన్న వాకిట యువ రాజాగారే కాబోలు నిలబడి కనిపించాడు.

"అరె, అప్పుడే వీరు రావటమూ, లోపల ప్రవేశించటమూ అయిపోయిందే! ఇప్పుడేం చెయ్యటం?" అని భీమన్న ఆలోచిస్తూ బిత్తరబోయి నిలబడి ఉండగా, ఆ ఎదటి వాకిట నుంచి లక్ష్మి వచ్చి, యువరాజా మీద ఎడమ చెయ్యివేస్తూ, "మీరిక్కడ నిలబడి ఏం చేస్తున్నారు?" అని అడిగింది.

అయితే మహాలక్ష్మి యువరాజాగారి మీద వేసిన చెయ్యి తన భుజం మీద పడేసరికి భీమన్న ఒక్క క్షణం బిత్తరపోయి నిజం తెలుసుకున్నాడు. అతను చూసినది యువ రాజా కాదు; అది తన ప్రతిబింబమే. తాను చూసిన చోట వాకిలి లేనేలేదు, ఎదురుగా ఉండే వాకిలి పెద్ద నిలువు టద్దంలో ప్రతి బింబించింది. కొత్త దుస్తులు ధరించి ఉండటంచేత భీమన్న తన రూపు తానే పోల్చుకోలేక పోయాడు. అదీగాక ఆ నిలువుటద్దం మామూలుగా అక్కడ ఉండదు. యువరాజాగారు వస్తున్నారుగదా అని దాన్ని ఏ సామానుల గదిలోనుంచో పైకి తీయించి, కడిగి తుడిచి హాలులో అమర్చారు.



భీమన్న మహలక్ష్మి అడిగిన ప్రశ్నకు జవాబు చెప్పే లోపుగా యువరాజాగారి పరివారం సమీపిస్తున్న అలికిడి అయింది. అందరూ ఎవరి స్థానాలలో వారు నిలబడ్డారు. యువరాజాగారు ఇంటి ముందు గుర్రం దిగగానే భీమన్న ఎదురు వెళ్ళి, "దయ చెయ్యాలి, ధర్మ ప్రభువులు!" అన్నాడు. మిగిలిన కార్యకర్త లందరూ తమ తమ పనులను సక్రమంగా చేసేశారు. ఏ విషయం లోనూ ఎలాటి లోపమూ జరగలేదు.

యువరాజా మంచి మాటకారి, తాను చాలా తెలివిగల వాణ్ణని అనుకుంటాడు. భీమన్నకూ అతనికీ దోస్తీ బాగానే కలిసింది.

భోజనాలు అయాక అందరూ హాలులో కూచున్నారు. గ్రామంలోని పెద్దలు చిన్న సభలాగా కొలువు తీరారు. యువరాజాగారు చాలాసేపు సామాన్య విషయాలనే అత్యాశ్చర్యకరమైనవిగా చెప్పాడు. అందరూ మర్యాద కోసం నోళ్ళు తెరిచి ఆలకిస్తూ, అవసరమైనప్పుడల్లా ఆశ్చర్యం అభినయించారు.

"ఈ పల్లెటూరి మొద్దుల తెలివి తేటలు చూస్తాం," అనుకుని యువరాజా పొడుపు కథలు వెయ్యసాగాడు.

యువరాజా వేసే పొడుపుకథలు అందరికీ తెలిసినవే. అందుచేత ఆయన పొడుపు కథ



వేసినప్పుడల్లా గ్రామపెద్దల్లో ఎవరో ఒకరు సమాధానం చెబుతూ వచ్చారు.

భీమన్న ఈ సంభాషణను ఆలకించటం మాని నిలువుటద్దంలో కనిపించే చోద్యం గురించే ఆలోచిస్తూ, తనకే తెలియకుండా, "ఒకటి రెండు చేస్తుంది, కుడిని ఎడమ చేస్తుంది. ఏం చిత్రం!" అనేశాడు.

భీమన్న అన్న మాటలు విన్న యువ రాజా అది కూడా ఒక పొడుపు కథే అను కుని, "ఇది నే నెప్పుడూ వినలేదే! ఏమిటది?" అని అడిగేశాడు.

భీమన్న వేసిన పొడుపుకు సమాధాన మేమిటో ఎవరికీ తెలీదు. అందరూ అతని కేసి ఆశ్చర్యంగా చూశారు.

తాను అన్నమాటలు ఒక పొడుపు కథ అయినందుకు భీమన్న లోలోపల సంతో షించి, "ఒకటి రెండు చేస్తుంది, కుడిని ఎడమ చేస్తుంది. ఏమిటది?" అని మరొక సారి గట్టిగా అన్నాడు.

"నాకు తెలీదు," అన్నాడు యువరాజా, ఎంతో ఆశ్చర్యం కనబరుస్తూ.

"మాకూ తెలీదు," అన్నారు మిగిలిన గ్రామపెద్దలంతా.

భీమన్న నవ్వి నిలువుటద్దం కేసి చూపుతూ, "అద్దం!" అన్నాడు.

అందరూ హర్షధ్వానాలు చేశారు. యువ రాజా కూడా సంతోషించి, "భేష్! ఈ కొత్త పొడుపు అందరికీ వేస్తాను. ఎవరూ చెప్ప లేరు!" అని ప్రకటించాడు.

అక్కడ ఉన్న వారందరికీ భీమన్న పైన గొప్ప అభిప్రాయం ఏర్పడింది. యువరాజా గారు డజన్ల కొద్దీ పొడుపులు వెయ్యటమూ, వాటికి పసి పిల్లలు కూడా జవాబు చెప్పటమూ, జమీందారుగారి అల్లుడుగారు ఒక్క పొడుపు వేసేసరికి యువరాజా వారు కళ్ళు వెళ్ళ బెట్టటమూ గురించి జనం ఎన్నో ఏళ్ళపాటు చెప్పుకున్నారు.

[పై నెల మరొక సంఘటన]





# రాకుమారి జులేకా

డమాస్కస్ నగరంలో అబ్దల్లా అనే ప్రసిద్ధ వ్యాపారస్తు డుండేవాడు. ఆయనకు హసన్ అని ఒకే ఒక కొడు కుండేవాడు. 'అబ్దల్లా తన కొడుక్కు మంచి మంచి గురువులను ఏర్పాటు చేసి, ఎంత ఖర్చయినా లక్ష్యపెట్టకుండా అనేక శాస్త్రాలూ, అనేక భాషలూ నేర్పించాడు. హసన్ కూడా చదువుపై శ్రద్ధ ఉంచి ఆదర్శ విద్యార్థి అనిపించుకున్నాడు. అందుచేత అబ్దల్లా తన కొడుకు భవిష్యత్తు గురించి ఎలాటి విచారమూ లేకుండా దేహం చాలించటానికి సిద్ధపడ్డాడు. ఆయన మరణ శయ్యపై ఉండి హసన్‌ను పిలిచి, "నాయనా, నాకు కాలం సమీపించింది. ఇక నీకు హితవు చెప్పే వారెవరూ ఉండరు. నాకున్న తృప్తి ఏమంటే నువు చక్కగా చదువుకుని ప్రాజ్ఞుడవయావు. అయినా భవిష్యత్తు ఎలా ఉండబోయేదీ చెప్పటం ఎవరితరమూ కాదు. అందుచేత నీ కొక్క సలహా చెబుతాను. ఎప్పటికైనా విధి ఎదురు తిరిగి జీవితం అంధకారమయమని తోచే రోజు వచ్చినప్పుడు మన తోటలోకి వెళ్ళి అక్కడ ఉన్న ఎండు చెట్టు కొమ్మకు ఉరి వేసుకో. ఇది నా ఆదేశం. అలా చేస్తే నీకు విమోచనం కలుగుతుంది," అన్నాడు. ఈమాటలంటూనే అబ్దల్లా కన్ను మూశాడు.

తండ్రి చేసిన కడపటి ఆదేశం హసన్‌కు ఆశ్చర్యం కలిగించింది. ధర్మవిరుద్ధమైన ఆత్మహత్యను ఆయనలాటి పండితుడెందుకు బోధించాడో అతనికి ఎంత ఆలోచించినా బోధపడలేదు. అయితే రోజులు గడిచిన కొద్దీ హసన్ ఈ ఆదేశాన్ని క్రమంగా మరిచిపోయి సరదాలలో మునిగి తేలసాగాడు. చదువుకున్నాడేగాని పసివాడు కాపటంచేత, లోకజ్ఞానం లేక అర్థంలేని సరదాలలో డబ్బు ఎడాపెడా ఖర్చు చేసి అతను త్వర

ఆర్. నారాయణరావు



లోనే ఉన్నదంతా పోగొట్టుకున్నాడు. చివరకు అతనికి ఇల్లూ, తోటా మాత్రమే మిగిలాయి. వీధుల్లోకి వెళ్ళి అడుక్కోవటం తప్ప అతనికి మరో మార్గం కనిపించలేదు.

తీరా ఈ పరిస్థితి ఏర్పడ్డాక హసన్ తన తండ్రి చేసిన ఉపదేశం సరి అయినదని గ్రహించగలిగాడు. అడుక్కు తినటం కన్న చావు వెయ్యి రెట్లు మేలు. అందుచేత అతను ఆత్మహత్య చేసుకోవటానికి నిశ్చయించి, ఒక బలమైన తాడు సంపాదించి, దాన్ని తీసుకుని తోటలోకి వెళ్ళాడు.

ఎండిపోయిన చెట్టు పెద్ద కొమ్మకు దిగువగా నేలలో రెండు నిలువు రాళ్ళు పాతి ఉన్నాయి. తాడు చివర ఒకటి ఆ రాళ్ళకు కట్టి, తాటిని కొమ్మ మీదిగా వేసి, దాని రెండో చివర ఉచ్చు అమర్చి, దాన్ని మెడకు తగిలించి, రాళ్ళపైన నిలబడి ఒక్క సారిగా దూకాడు హసన్. ఉచ్చు అతని మెడకు బిగుసుకుని అతనికి స్పృహ తెలియకుండా పోతున్నదశలో కొమ్మ పెళ పెళా విరిగింది. హసన్ కింద పడిపోయి, లేచి కూచుని తానింకా బతికి ఉన్నందుకు ఆశ్చర్యపడ్డాడు. అతని ముందు ఏదో నేల మీద గులకరాయిలాగా పడిఉండి ధగధగా మెరుస్తున్నది. అది ఏమిటో అతను తెలుసుకునే లోపల అలాటిదే మరొకటి రాలింది. హసన్ తల ఎత్తి చూసి, విరిగిన కొమ్మ డొల్లగా ఉన్నదనీ దానిలో ఇంకా కొన్ని మణులున్నాయనీ గ్రహించాడు.

అతను చప్పున లేచి, మెడకు తగిలించి ఉన్న ఉచ్చు తీసేసి, ఇంటికి వెళ్ళి గొడ్డలి ఒకటి తెచ్చి విరిగిన కొమ్మనూ, చెట్టు మొదలునూ పగలగొట్టాడు. చెట్టు కాండమంతా బోలుగానే ఉన్నది. దాని నిండా వజ్రాలూ, వైడూర్యాలూ, గోమేధికాలూ సమస్తమైన రత్నాలూ కొల్లగా ఉన్నాయి.

హసన్‌కు ఈసారి తండ్రి ఉపదేశంలోని అంతరార్థం నిజంగానే అర్థమయింది. తన

కోసం తన తండ్రి ఈ చెట్టులో అంతులేని నిధి దాచిపెట్టాడు. తాను భాగ్యవంతుణ్ణన్న తృప్తితోబాటు హసన్‌కు తన చిలిపిసరదాల మీద విరక్తి కూడా వచ్చింది. అతనికి డమాస్కస్ విడిచిపెట్టా లనిపించింది. పర్షియాలోని షీరాజ్ నగరం వెళ్ళాలని పించింది. అక్కడి జీవితం సార్థకంగానూ, జ్ఞాన సంపన్నంగానూ ఉంటుందని అతని తండ్రి అంటూండేవాడు. హసన్‌కు పర్షియా దేశపు పారసీక భాష తెలుసును కనక షీరాజ్‌లో రత్న వర్తకుడుగా స్థిరపడటం ఏమంత కష్టసాధ్యమైన పనికాదు.




అందుచేత హసన్ తన సొత్తంతా తీసుకుని, క్షేమంగా ప్రయాణించి షీరాజ్ చేరి, అక్కడి బసలన్నిటిలోకీ మేలైనదిగా చూసి అందులో ఒక పెద్ద గది అద్దెకు పుచ్చుకుని, విశ్రాంతి అయినా తీసుకోకుండా, దుస్తులు మార్చుకుని తన కున్న మంచి దుస్తులలో ఉత్తమమైనవి ధరించి నాలుగు వీధులూ తిరిగి వద్దామని బయలుదేరాడు.

అతను పింగాణీ మసీదుకు వెళ్ళి, భగవధ్యానం చేసి బయటికి వస్తుండగా అక్కడి రాజుగారి వజీర్లలో ఒకాయన వీధి వెంబడి పోతూ అతన్ని చూసి అగి పలకరిస్తూ, "నాయనా, నీ దుస్తులు చూస్తే విదేశీయుడివి లాగున్నావు. ఏ దేశం నుంచి వస్తున్నావు?" అని అడిగాడు.

"బాబూ, మాది డమాస్కస్. ఇక్కడి వారి సాహచర్యంతో సార్థక జీవనం అలవరుచుకుందామని వచ్చాను," అని హసన్ వినయంగా జవాబిచ్చాడు.

ఈ మాటకు వజీరు సంతోషించి, హసన్‌తో, "చాలా చక్కగా మాట్లాడావు, నాయనా? నీ వయసెంత?" అన్నాడు.

"అయ్యా, నాకు పదహారోఏడు నడుస్తున్నది," అన్నాడు హసన్.

"యుక్త వయసులో ఉన్నావు. నిన్ను రాజుగారి దగ్గిరికి తీసుకుపోతాను. ఆయన

నీవంటి అందమైన కుఱ్ఱాళ్ళంటే ముచ్చట పడతారు. అంతఃపురోద్యోగులలో ఒకడుగా నిన్ను ఆయన నియమించవచ్చు. నీ కభ్యంతరం లేకపోతే, నా వెంట రా,'' అన్నాడు వజీరుగారు.

హసన్ సంతోషంగా సమ్మతించాడు. హసన్ అందమూ, మాట తీరూ మాత్రమే గాక, అతను పారసీక భాష స్వచ్ఛంగా మాట్లాడటం కూడా వజీరుకు ఎంతో ముచ్చట గొలిపింది.

ఆయన చెప్పినట్టే రాజుగారు హసన్‌ను చూసి సంతోషించి, అతనికి ప్రతీహారి పని ఇచ్చాడు. వజీర్ హసన్‌కు ప్రతీహారీ దుస్తులు తొడిగించి, అతని విధులు తెలిపి, అతన్ని తన అజమాయిషీలోనే ఉంచుకున్నాడు.

రాజాంతఃపురానికి చెందిన పన్నెండుగురు ప్రతీహారులు గాని, ఇతర ఉద్యోగులు గాని సాయంకాలం అయాక రాజోద్యానంలో నడవరాదని ఒక నియమం ఉన్నది. ఎందుకంటే ఆ సమయంలో అంతఃపుర స్త్రీలు ఉద్యానంలో విహరించటానికి వస్తారు. పొరపాటున పురుషు డెవడైనా ఈ నియమాన్ని ఉల్లంఘించాడో, వాడి తల తీసేస్తారు.

ఒకనాడు హసన్ ప్రమాదవశాన ఈ నియమం ఉల్లంఘించాడు. అతను అపరాహ్ణ సమయంలో ఉద్యానంలోకి వెళ్ళి, విశ్రాంతి



కోసం ఒక బల్ల మీద పడుకుని చల్ల గాలికి అలాగే నిద్రపోయాడు. ఎవరో స్త్రీలు, "మన్మధుడే! మన్మధుడే! మన్మధుడే! ఎంత అందం! ఎంత అందం! ఎంత అందం!" అన్నట్టు కల వచ్చి హసన్ ఉలిక్కిపడి లేచి చుట్టూ కలయజూసే సరికి సూర్యాస్త మయం కూడా అయిపోయింది. అదృష్ట వశాత్తూ అక్కడ మనుషు లెవరూ లేరు. తాను విన్న స్త్రీ కంఠాలు కలలోని వనుకుని హసన్ ఆ స్థలం విడిచి పోదామని గబగబా నడవసాగాడు. ఇంతలో ఎవరో స్త్రీ నవ్వటం వినిపించింది. ఆ నవ్వే మనిషి, "ఏమిటా తొందర?" అని అడిగింది.

విచ్చుకత్తుల వాళ్ళు వెంటబడిన దాని కన్న ఎక్కువగా భయబడి హసన్ ఉద్యానపు బాట వెంబడి పరిగెత్తాడు. అతనొక మలుపు తిరిగే సరికల్లా ఒక స్త్రీ అతని దారికి అడ్డుగా నిలబడి ఉన్నది. వెన్నెలే మనిషి ఆకారం ధరించినట్టుగా ఉన్న ఆ స్త్రీ ముఖం చంద్రుణ్ణి తలదన్నేలాగా ఉన్నది.

హసన్ బిడయపడుతూ నిలబడిపోయి తల దించేసుకున్నాడు. అతను ఎన్నడూ ఆడవాళ్ళతో సంభాషించి ఎరగడు.

"అంత కంగారుగా పరిగెత్తుతున్నావు, కారణ మేమిటి?" అని ఆమె హసన్‌ను అడిగింది.





"ఈ అంతఃపురంలో ఉండే దానివైతే నే నెందుకు పరిగెత్తుతున్నానో నీకే తెలుస్తుంది. ఈ సమయంలో ఇక్కడ తారట్లాడే పురుషులను శిరశ్ఛేదం చేస్తారు. దయచేసి దారి వదులు," అన్నాడు హసన్.

"ఈ మాట ఇప్పుడా నీకు జ్ఞాపకం వచ్చింది? ఇంత పొద్దు పోయాక తోట విడిచి పోవటం కన్న తెల్లవారిందాకా తోటలో ఉండి పోవటమే నీకు క్షేమం. రాజభవనంలో ప్రవేశించటం అపాయకరం," అన్నదామె.

హసన్ కళ్ళ నీళ్ళ పర్యంతమై, వణికి పోతూ, "నన్నెలాగూ ఇవాళ చిత్రవధ చేసేస్తారు. హత్యాపాతకం ఎందు కంటగట్టుకుంటావు. నన్ను వెళ్ళనీ!" అంటూ ఆమెను దాటి ముందుకు పోబోయాడు.

ఆమె ఎడమచేత్తో అతన్ని పట్టుకుని కుడి చేత్తో తన మేలిముసుగు తొలగించి, "నా ముఖం చూసి నేను అందంగా ఉన్నానో లేదో చెప్పు. నా వయసు పద్దెనిమిదేళ్ళు. కన్యను. నీవు తప్ప నా ముఖం ఇంతవరకు ఏ పురుషుడూ చూడలేదు. నా నుంచి అలా పారిపోవటానికి ప్రయత్నించావంటే నాకు చెడ్డ కోపం వస్తుంది," అన్నది.

"మహారాణీ, నీ అందం ముందు చంద్రుడు కూడా దిగదుడుపే. కాని అందువల్ల నాకు రానున్న ప్రమాదం ఎలా తొలగిపోతుందీ?" అన్నాడు హసన్ ఆందోళనతో.

"నీకు ప్రమాదమన్న మాట నిజమేగాని, అది నీవనుకునే ప్రమాదంకాదు. నేనెవరినో నీవెరగవు. నీవు నా రక్షణలో ఉన్నంత కాలమూ నీకు నా ఆగ్రహం మించిన ప్రమాదం ఏమీలేదు. అసలు సంగతి చెప్పు —నీ వెవరు? ఈ దివాణంలో ఏం పని చేస్తున్నావు?" అని ఆమె అడిగింది.

"నా పేరు హసన్. మాది డమాస్కస్. నన్ను రాజుగారు ఒక ప్రతీహారిగా నియమించారు. వజీరుగారికి నే నంటే ఎంతో అభిమానం," అని హసన్ చెప్పాడు.

ఆమె అతనితో, "అయితే నా రహస్యం నీతో చెప్పేస్తాను. ఈ వెన్నెలలో నీ అందం చూస్తే నాకు నీ మీద ప్రేమ కలిగింది. నీవు కూడా నన్ను ప్రేమిస్తున్నావా?" అన్నది.

ఈ మాటలు వినే సరికి హసన్‌కు పారవశ్యం వచ్చేసింది. అతనికి స్త్రీ ప్రేమ అనేది ఏమిటో తెలియదు. ఈమె చాలా అందంగా ఉన్నది. పైపెచ్చు తనను ప్రేమిస్తున్నది. అతను ఆమె పాదాల ముందు మోకరించి, "ఈ దీనుడు నీ కోసం ప్రాణాలైనా ఇస్తాడు!" అన్నాడు.

ఆ క్షణంలోనే కిలాకిలా నవ్వుతూ, చప్పట్లు చరిచి కేకలు పెడుతూ పదిమంది కన్యలు అటుగా వచ్చారు. "పాపం, ఆ అబ్బాయిని ఏడిపించకు, కైరీయా!" అన్నారు. అసలే ఆడవాళ్ళ మధ్య మసలటం తెలియని హసన్‌కు, వీళ్ళందరూ కలిసి తనను ఏడిపించటానికి కైరీయా అనేదాన్ని తన మీదికి పంపకం చేశారని తెలియగానే కోపమూ, అవమానమూ ముంచుకొచ్చాయి. ఇంత లజ్జలేని ఆడపిల్లలు ప్రపంచంలో ఉంటారని అతను ఊహించనైనా లేదు. అతను చేసేదిలేక లోపలే కుమిలిపోతూ తల వంచుకుని ఆ ఆడపిల్లల మధ్య నిలబడ్డాడు. ఆ సమయంలో అక్కడికి పూపొదల




వెనక నుంచి పన్నెండో పిల్ల వచ్చింది. ఆమె రాగానే అందరూ మౌనంవహించి, వెనక్కు తగ్గి ఆమెకు దారి ఇచ్చారు. ఆమె హసన్ ఎదటికి వచ్చి, "నీవు వేళ అతిక్రమించి అంతఃపుర స్త్రీలు విహరించే చోటికి రావటమేగాక వారిని ప్రేమభిక్షలు వేడతావా? నీకు మరణ దండన విధించవలిసి వచ్చినందుకు బాధగానే ఉంది. చిన్నవాడవు! అందగాడవు!" అన్నది.

కైరీయా అన్న పిల్ల ముందుకు వచ్చి ప్రాధేయపడుతూ, "మహారాణీ! జులేకా! అతను అమాయకుడు. నేరక చేసిన అపచారాన్ని క్షమించు. అతన్ని కాపాడు," అన్నది.



జులేకా క్షణంసేపు యోచించి, "నీవే క్షమించమంటున్నావు గనక ఈసారికి క్షమిస్తాను. ఇతన్ని ఇలాగే వెళ్ళిపోనిస్తే మనం కఠినాత్ముల మనుకుంటాడు. మన హృదయాలు మంచివేనని అతనికి తెలియబరచటానికి తగిన కార్యక్రమం ఏదన్నా చెయ్యాలి. ముందితన్ని మన అంతఃపురం లోపలికి తీసుకుపోదాం. అక్కడ ఇంత వరకు మగవాడన్నవాడు కాలుపెట్ట లేదు. ఇతనే మొదటి వాడవుతాడు," అంటూ ఒక కన్యకు సంజ్ఞ చేసింది.

ఆ కన్య వెళ్ళి స్త్రీలు ధరించే దుస్తులు తెచ్చింది. హసన్‌కు వాటిని కట్టబెట్టి ఆడదానిలాగా తయారు చేశారు. ఈ వేషంతో జులేకా తృప్తిపడిన మీదట అందరూ కలిసి అంతఃపురంలోకి వెళ్ళారు.

అక్కడ ఒక ఖాళీ గదిలో తివాసీపైన ఇరవై జలతారుతో అల్లిన చదరలు గుండ్రగా పరిచి ఉన్నాయి. గది గోడలు పాలరాతివి. వాటిలో ముత్యాలూ, నీలాలూ పొదిగి ఉన్నాయి. జులేకా రాజకుమార్తె అనీ, మిగిలిన అందరూ ఆమె చెలికత్తెలనీ, ఈ గది జులేకా విందుచేసే గది అనీ ఒకతె హసన్‌తో రహస్యంగా చెప్పింది. మిగిలిన చెలికత్తెలందరూ చుట్టూ ఉన్న చదరలపైన కూచుని, హసన్‌ను మధ్యలో, జులేకా సరసన కూచోబెట్టారు. జులేకా భోజన పదార్థాలు వడ్డన చెయ్యమని ఉత్తరు విచ్చింది. పదహారుమంది అందగత్తెలయిన దాసీలు వడ్డనకు ఉపక్రమించారు.

హసన్‌కు ఆ ఆడవాళ్ళంటే బెదురు పోనే లేదు. అతను మధ్యమధ్య కైరీయా కేసి చూశాడు. కాని ఆమె తన కేసి చూడగానే తల దించేసుకున్నాడు. జులేకా అతని వాలకం చూసి, "హసన్, ఎందుకలా బెదురు గొడ్డులా అయిపోయావు? మేము నిన్ను తినెయ్యములే. మా అనుజ్ఞ లేకుండా ఇక్కడికెవరూ రారు. ఎందుకు భయం? నేనెవరో

నీకు తెలుసుగా? ధైర్యంగా తల ఎత్తి మా కేసి చూడు. చూసి, మాలో నీ కెవరు నచ్చారో జంకకుండా చెప్పు," అన్నది.

ఈ మాటలతో హసన్‌కు ధైర్యం రావటానికి బదులు మరింత భయం కలిగింది.

"ఎవరు బాగున్నారన్నా మిగిలిన వాళ్ళకి కోపం వచ్చిపోతుందని బిడియపడుతున్నావు లాగుంది. మాలో అలాటి భేదాలేమీ లేవు. నీవు నిర్భయంగా నీ ఉద్దేశం చెప్పవచ్చు," అని జులేకా అతన్ని ప్రోత్సహించింది.

హసన్ కాస్త ధైర్యం కూడగట్టుకుని కన్యలందరినీ పరకాయించి చూశాడు. అందులో అందంగా లేనివారెవరూ లేరు, కాని అందరికన్న ఒక్క పిసరు అందగత్తె కైరీయా; మిగిలినవాళ్ళు ఆమెకు చాలరు. కాని ఆ మాట అనటానికి అతనికి ధైర్యం చాలక, "నాకు ఏమనాలో తెలియకుండా ఉన్నది. నక్షత్రాలు ఎంత అందంగా ఉన్నా చంద్రుడు చంద్రుడే," అంటూ, తన ఉద్దేశం అది కాదన్నట్టుగా కైరీయా కేసి తల తిప్పి ఒక చూపు చూశాడు.

జులేకా ఈ మాట విని, "లాంఛనగా అసదగిన మాటే అన్నావు. అయినా నిన్ను తప్పు పట్టను. నా విషయం వదిలేసి, నా చెలికత్తెలలో నీ కెవరు ఎక్కువ నచ్చారో చెప్పు చూతాం?" అన్నది.



"చెప్పు, చెప్పు," అని అందరూ హసన్‌ను తొందర చేశారు. అందరి కన్న హెచ్చుగా తొందర చేసింది కైరీయా.

హసన్ సిగ్గు బిడియాలు వదిలేసి, కైరీయా కేసి వేలుపెట్టి చూపుతూ, "మహా రాణీ, నాకు నచ్చినది ఈమే. అల్లాసాక్షిగా నే నామెను ప్రేమిస్తున్నాను," అన్నాడు.

ఈ మాటకు మిగిలిన ఆడవాళ్ళు అలగక పోగా, కిలకిలా నవ్వుతూ, ఒకరినొకరు మోచేతులతో తట్టుకున్నారు. "అక్క చెల్లెళ్ల మధ్యనే ఎంతో అసూయ ఉంటుందిగదా వీరిలో లేకపోవటం ఏమి ఆశ్చర్యం!" అనుకున్నాడు హసన్.

జులేకా అతన్ని అభినందిస్తూ, "నీవు సరిగా ఎన్నుకున్నావు, హసన్. నా ఉద్దేశంలో కూడా ఆమె మా అందరిలోకీ రాణి. ఆమె అందం ముందు మా అందం ఎందుకూ పనికి రాదు. ఆమెను గురించి నీకు శతాంశం కూడా ఇంకా తెలియదు," అన్నది.

మిగిలిన చెలికత్తెలు కైరీయా అందాన్ని పొగడి, ఆమెను అభినందించారు. తరవాత వారు హసన్ చేతిలో కైరీయా చెయ్యి ఉంచి వారిద్దరికీ వివాహం జరగాలనీ ఆశీర్వదించారు. పాటలతోనూ, వినోదాలతోనూ ఆ రాత్రి గడిచిపోయింది.

జులేకా లేచి, "హసన్, ఇక మేము వెళ్ళి పడుకోవాలి. నీ ప్రేమ సఫలం కావటానికి నేను శాయశక్తులా పని చేస్తాను. ప్రస్తుతం నిన్ను నిరపాయంగా అంతఃపురం నుంచి బయటికి చేర్చాలి," అన్నది. ఆమె ఒక ముసలిదాని చెవిలో ఏదో రహస్యంగా చెప్పింది. ముసలిది హసన్ చెయ్యి పట్టుకుని తన వెంట తీసుకు పోయింది. చిన్న చిన్న ఇరుకు గొందుల వెంట అటుతిరిగీ, ఇటుతిరిగీ చిట్టచివరకు చిన్న ద్వారం వద్దకు వారిద్దరూ వచ్చారు. ముసలిది దాని తాళం తీసి హసన్‌ను బయటికి పంపింది.

[ముగింపు వచ్చే సంచికలో]





# చాణక్యుడి కథ

## 2

నందుడి పరిపాలన అయితే అంతమయింది గాని, నందుడి అనుచరులు రకరకాల అరాచకచర్యలు చేస్తూ, పరిపాలనలో శాంతి లేకుండా చేశారు. వీరిని అదుపులో పెట్ట గల మనస్తత్వం గల ఒక సాలెవాడు చాణక్యుడి కళ్ళపడ్డాడు. ఈ సాలెవాడు తన ఇంట నల్లులపుట్ట కనిపించిన చోటల్లా నిప్పుపెట్టటం ఆయన గమనించాడు. అరాచకచర్యలను చేసేవారందరినీ ఈ సాలెవాడు త్వరలోనే నిగ్రహించ గలిగాడు. చాణక్యుడికి వాడియందు ఏర్పడిన విశ్వాసం రుజువయింది.

చంద్రగుప్తుడికి రాజ్యం వచ్చింది గాని కోశంలో డబ్బు లేదు. ఈ లోటు భర్తీ చెయ్యటానికి చాణక్యుడు దొంగ పాచికలతో బంగారం పణం పెట్టి జూదం ఆడి, కొంత బంగారం గడించాడు. కాని ఇలా కోశాన్ని నించటం దాదాపు అసాధ్యంగా కనిపించింది. అప్పుడు చాణక్యు డొక యుక్తి చేశాడు. ఆయన నగరంలోని ధనికులందరినీ విందుకు పిలిచి, భోజనంపెట్టి, పుష్కలంగా తాగించాడు. అందరూ కైపు మీద ఉండగా చాణక్యుడు లేచి నిలబడి, తన అదృష్టం ఎలాటిదో, రాజు ఎలా చెప్పు చేతలలో ఉంటాడో తెలియజేసే శ్లోకం ఒకటి చదివాడు. వెంటనే మిగిలిన వాళ్ళు కూడా తమతమ గొప్పలు చెప్పుకుని, ఎవరి దగ్గిర ఎంతెంత ధనం ఉన్నదీ బయట పెట్టుకున్నారు. చాణక్యుడు వారి బొక్కసాలు కొల్లగొట్టి రాజుగారి బొక్కసం నించాడు.

చంద్రగుప్తుడి రాజ్యంలో ఒకసారి పెద్ద కరువు వచ్చింది. రాజధానిలో ఉండే జైన



సన్యాసులకు భిక్ష కరువైపోయింది. వారి ఆచార్యుడైన సుస్థితుడు తన శిష్యులను నగరం విడిచిపోయి, మరెక్కడనైనా భిక్ష చేసుకు బతకమని సలహా ఇచ్చాడు. అందరూ వెళ్ళిపోయారు గాని ఇద్దరు శిష్యులు గురువును వదలిపోవటానికి మనస్కరించక తిండి కోసం ఒక ఎత్తువేశారు. వారి కొక అంజనం తెలుసు. అది కళ్ళకు పూసుకున్నవాళ్ళు అదృశ్యులవుతారు. ఆ శిష్యు లిద్దరూ ఆ అంజనం పూసుకుని, అదృశ్యులై రాజగృహం ప్రవేశించి, చంద్రగుప్తుడి పళ్ళెం వద్దనే కూచుని, అతనితో బాటు భోజనం చేసి వెళ్ళిపోతూ వచ్చారు.

ఇలా కొంతకాలం జరిగినాక చాణక్యుడు చంద్రగుప్తుడు చిక్కిపోతున్న లక్షణాలు గమనించి కారణ మడిగాడు. "నాకు కూడా కారణం తెలియలేదు. రోజూ నాకు మామూలు ప్రకారమే భోజనం వడ్డిస్తున్నారు. కాని అదంతా నా కడుపులోకి పోవటంలేదని చెప్పగలను," అన్నాడు.

ఎవరైనా అదృశ్యంగా వచ్చి చంద్రగుప్తుడి ఆహారం తస్కరించుతూ ఉండవచ్చునని చాణక్యుడికి తోచింది. ఇది నిజమో కాదో తేల్చుకోవటానికి ఆయన చంద్రగుప్తుడి భోజనశాల అంతటా మెత్తని పొడి చల్లించాడు. చంద్రగుప్తుడి భోజనం పూర్తి అయాక ఆ పొడిలో ఎవరివో కాళ్ళ గుర్తులు కనిపించాయి.

మర్నాడు చంద్రగుప్తుడు భోజనం చేసే సమయంలో చాణక్యుడు భోజనశాలలో ఘాటైన పొగ పెట్టించాడు. ఆ పొగకు అందరి కళ్ళూ చిరచిరలాడి ఆగకుండా కళ్ళనీరు కారింది. ఆ నీటి వెంట జైన యువకులు పెట్టుకున్న అంజనం కాస్తా కరిగిపోయి, వారు అందరికీ కనిపించారు. అందరూ నిర్ఘాంతపోయారు. వారికి కోపం కూడా వచ్చింది. అయితే చాణక్యుడు మాత్రం జైనసన్యాసులకు ఒక్క సమ



స్కారం పెట్టి, ఎంతో మర్యాదగా సాగ నంపాడు. ఇతరుల ఎంగిలి తిన్నందుకు చంద్రగుప్తుడు బాధపడుతూంటే, వారికి భిక్ష పెట్టినందుకు పుణ్యం లభించిందని నచ్చ చెప్పాడు. అయినప్పటికీ చాణక్యుడు ఆచార్యుడికి కబురు చేసి, ఆయన శిష్యులు చేసిన పనికి ఆక్షేపణ తెలియజేశాడు.

"తప్పు మీ పౌరులదే. మా సన్యాసులకు వారు భిక్ష పెట్టినట్టయితే ఇలాటి పరిస్థితి ఏర్పడి ఉండదు," అని ఆచార్యుడు జవాబు పంపాడు. అది మొదలు పాటలీపుత్రంలో జైనసన్యాసులకు విడవకుండా భిక్ష లభించే ఏర్పాట్లు జరిగాయి.

చంద్రగుప్తుడి పైన ఎవరైనా విష ప్రయోగం చేస్తారేమోనని చాణక్యుడు అతని ఆహారంలో విషం చేర్చమని ఆజ్ఞాపించాడు. ఈ విషం మోతాదు క్రమంగా వృద్ధి అయి చంద్రగుప్తుణ్ణి ఏ విషమూ ఏమీ చెయ్యలేని స్థితి ఏర్పడింది. ఈ సంగతి చంద్రగుప్తుడికి మాత్రం తెలియదు.

దుర్ధర నిండు చూలాలుగా ఉండి ఒక నాడు చంద్రగుప్తుడి భోజనపుపళ్ళెం వద్ద కూచుని అతని ఆహారం కొంచెం తీసుకు తిన్నది. అది బాగా విషపూరితం కావటం చేత వెంటనే ఆమె ప్రాణాలు వదిలింది. ఆ క్షణంలోనే అక్కడికి వచ్చిన చాణక్యుడు జరిగిన ప్రమాదం గుర్తించి, అప్పుడే ప్రాణాలు వదిలిన దుర్ధర గర్భాన్ని చీల్చి అందులో నుంచి శిశువును లాగాడు. అప్పటికే ఒక్క బిందువు విషం శిశువులోకి ప్రవేశించింది. ఈ కారణం చేతనే ఆ శిశువుకు బిందుసారుడని పేరు పెట్టారు.

చంద్రగుప్తుడు చనిపోయినాక చాణక్యుడు బిందుసారుడికి తానే స్వయంగా పట్టాభిషేకం చేశాడు. అయితే బిందుసారుడి కింద ఎంతో కాలం మంత్రిగా ఉండలేదు. చాణక్యుడు సుబంధు డనే వాణ్ణి చేరదీసి రాజకీయతంత్రం నేర్పి తన అనుచరుడుగా

ఉంచుకున్నాడు. ఈ సుబంధుడికి మంత్రిత్వ కాంక్ష పట్టుకున్నది. అతను బిందుసారుడితో చాణక్యుణ్ణి ఎంత మాత్రమూ నమ్మవద్దనీ, ఆయన బిందుసారుడి తల్లి గర్భాన్ని చీల్చిన వాడనీ చెప్పాడు. బిందుసారుడు విచారించగా ఈ సంఘటన జరిగిన మాట నిజమేనని తెలిసింది. దానితో అతనికి చాణక్యుడి పైన ఎక్కడలేని ద్వేషమూ పుట్టుకొచ్చింది.

తన ప్రత్యర్థి జయించాడని తెలియగానే చాణక్యుడు తన భవిష్యత్తును గురించి వైరాగ్యం అవలంబించాడు — కాని ఆ ప్రత్యర్థిని మాత్రం క్షమించలేదు. సుబంధుడి పతనం కోసం ఆయన ఒక ప్రయోగం చేశాడు. ఆయన భూర్జపత్రాల పైన ఏదో రాసి, ఆ పత్రాలనూ కొన్ని సుగంధ ద్రవ్యాలనూ ఒక అందమైన పేటికలో ఉంచి, ఆ పేటికను తన పెట్టెలో పెట్టి భద్రంగా తాళం వేశాడు. అనంతరం ఆయన తన యావదాస్తినీ పేదసాదలకు దానంచేసి, ఊరి బయట ఉండే చెత్తకుప్ప మీదికి వెళ్ళి ప్రాయోపవేశం చేశాడు.

ఈ స్థితిలో బిందుసారుడికి చాణక్యుణ్ణి గురించి వాస్తవం తెలియవచ్చింది. అతను ఎంతో పశ్చాత్తాప పడి, చాణక్యుడి వద్దకు వెళ్ళి, వచ్చి మంత్రి పదవి నిర్వర్తించ



మని ప్రాధేయపడ్డాడు. కాని చాణక్యుడు తన దీక్ష మానలేదు. బిందుసారుడు తిరిగివచ్చి తన ఆగ్రహమంతా సుబంధుడి పైన వెళ్ళ బోసుకున్నాడు. సుబంధుడు తాను నిర్దోషిననీ, చాణక్యుడి మనసు మారుస్తాననీ రాజుతో అన్నాడు. ఆ ప్రకారమే అతను చాణక్యుడి వద్దకు వెళ్ళి, ఏవో అనునయవాక్యాలు మాట్లాడుతున్నట్టే మాట్లాడుతూ, నిపురు గప్పిన నిప్పు కణిక ఒకటి చెత్తకుప్పలో జార విడిచాడు. దానితో చెత్తకుప్ప అంటుకుని మండింది. చాణక్యుడా మంటలోనే బూడిద అయాడు.

బిందుసారుడి అనుమతితో సుబంధుడు చాణక్యుడి ఇల్లు ప్రవేశించి, ధనం కోసం ఇల్లంతా గాలించగా చాణక్యుడి పెట్టెలో ఉన్న పేటిక బయట పడింది. దాన్ని తెరవగానే గుప్పున సువాసన పైకి చిమ్మింది. తరవాత అతనికి భూర్జపత్రాలు కనిపించాయి. చాణక్యుడి ధనం గురించిన రహస్యాలు అందులో ఉంటాయనుకుని సుబంధుడు చదివి చూసి తెల్లబోయాడు. సన్యాసి జీవితం గడపనివారు ఈ సుగంధం వాసన చూస్తే చచ్చిపోతారని భూర్జపత్రాలపై రాసి ఉన్నది. అది నిజమో కాదో తెలుసుకోవటానికి ఆ సుగంధాన్ని ఒక మనిషికి గట్టిగా వాసన చూపించాడు సుబంధుడు. వాడు విరుచుకు పడిపోయి చచ్చాడు. ఎన్ని విరుగుళ్ళు ప్రయోగించినా ఫలితం లేకపోయింది. తనకూ అదే గతి పడుతుందనుకుని సుబంధుడు తన మంత్రిత్వానికి నీళ్ళు వదిలి జైన గురువు వద్ద సన్యాసం పుచ్చుకున్నాడు. అది చిత్తశుద్ధితో పుచ్చుకున్న సన్యాసం కాదని బాగా ఎరిగి వున్న తోటి సన్యాసులందరూ అతన్ని చాలా హీనంగా చూశారు.

చాణక్యుడిపై కుట్రచేసిన ఫలితం సుబంధుడికి దక్కలేదు. చాణక్యుడు చచ్చి కూడా తన ప్రత్యర్థిని సాధించాడు!






తార లక్ష్మణుడికి అడ్డం వచ్చి, "లక్ష్మణా, తొందరపడి సుగ్రీవుణ్ణి నిందించ వద్దు. అతను రామ కార్యం ఏమర లేదు. వానరు లందరూ పదిహేను రోజులలో రావాలనీ, రాని వారికి మరణశిక్ష అనీ సుగ్రీవుడు అదివరకే ప్రకటించాడు. ఈవాళే గడువు ఆఖరు రోజు. చాలాకాలం కష్టాలు అనుభవించిన సుగ్రీవుడు ఇప్పుడు భోగ లాలసుడై ఉన్న మాట నిజమే. కాని నీవు దానిని క్షమించ వచ్చు. అందుచేత నీవు కోపం మాను," అన్నది.

తార మాటలతో లక్ష్మణుడు మెత్త బడ్డాడు. అది చూసి సుగ్రీవుడికి కాస్త ధైర్యం వచ్చింది. అతను లక్ష్మణుడితో, "లక్ష్మణా, రాముడు నాకు చేసిన మహోప కారంలో నే నాయనకు చెయ్యబోయేది ఏపాటి? రాముడి పట్ల నాకున్న చనువుకొద్దీ నేను కొంచెం జాప్యం చేసి ఉంటే నన్ను క్షమించాలి. లోకంలో తప్పు చెయ్యనివాడు ఉంగడుగద," అన్నాడు.

దానికి లక్ష్మణుడు, "సుగ్రీవా, నీ సహాయం మాకు దేతవలు చేసే సహాయమే. నీవు ఒకసారి వచ్చి ఎంతో దుఃఖంలో ఉన్న రాముణ్ణి ఊరడించు. ఆయన దుఃఖం చూడలేకనే నేను ఆగ్రహం చెందాను, నన్ను క్షమించు," అన్నాడు.

సుగ్రీవుడు హనుమంతుడి కేసి తిరిగి, "వానరుల నందరినీ పిలుచుకు రమ్మని నే నింతకు ముందే దూతలను పంపాను. వారి వెనక ఇప్పుడు మరికొందరు వానరు

లను పంపి, అనేక పర్వతాలలోనూ, సముద్ర తీరాలా, వనాలలోనూ ఉండే రక రకాల వానరులు శీఘ్రంగా వచ్చి చేరే ఏర్పాటు చెయ్యి. వారిని రప్పించటానికి సామదానాది ఉపాయాలు ప్రయోగించు. పది రోజులలోగా రాని వానరులకు మరణ శిక్ష! ఇది నా ఆజ్ఞ!" అన్నాడు.

అలాగే హనుమంతుడు అనేకమంది వానరులను అనేక దిక్కులకు పంపాడు. క్రమంగా వానర బలగాలు కిష్కింధకు రాసాగాయి. నల్ల కోతులు, పచ్చ కోతులు, తెల్ల కోతులు, భయంకరమైన ఎర్ర కోతులు—అన్ని రకాల కోతులూ వచ్చాయి. వానరులు తాముండే చోట దొరికే పళ్ళూ, సువాసనగల పూలూ కూడా తెచ్చారు; వాటిని సుగ్రీవుడికి కానుకగా ఇచ్చారు.

తమ నిమిత్తమై పెద్ద ఎత్తున పని ప్రారంభించిన సుగ్రీవుడి పైన భక్తి విశ్వాసాలేర్పడి లక్ష్మణుడు అతన్ని తాముండే చోటికి ఆహ్వానించాడు. సుగ్రీవుడు సమ్మతించి, తన పల్లకి తెప్పించి, అందులో లక్ష్మణుణ్ణి ఎక్కమని, అతనితోబాటు తాను కూడా ఎక్కి కూచుని, రాముడుండే చోటికి బయలుదేరాడు. వానరు లతనికి తెల్ల గొడుగు పట్టారు, వింజామరాలు వీచారు, శంఖ ధ్వానాలు చేశారు, భేరీ భాంకారాలు



మోగించారు, స్తోత్ర పాఠాలు దారి పొడుగునా చదివారు. కొన్ని వందలమంది వానర వీరులు పల్లకి వెంట నడిచారు.

ప్రస్రవణ పర్వతం మీది గుహ వద్ద పల్లకి దిగింది. సుగ్రీవుడు లక్ష్మణుడితో సహా పల్లకి దిగి రాముణ్ణి సమీపించి, చేతులు పైకెత్తి నమస్కారం చేసి నిలబడ్డాడు. మిగిలిన వానరులంతా అలాగే చేతులు పైకెత్తి నమస్కారాలు చేస్తూ నిలబడ్డారు. వారి చేతులు రాముడికి చెరువులోని తామర మొగ్గల్లాగా కనిపించాయి.

రాముడు సుగ్రీవుణ్ణి సమీపించి; అతను సాష్టాంగ పడగా లేవనెత్తి ఆలింగనం చేసుకుని, లాంఛనగా సహాయం అడిగాడు. దానికి సుగ్రీవుడు, "రామా, నా దూతలు పిలవగా ప్రపంచంలోని అన్ని మూలల నుంచీ మహా పరాక్రమవంతులైన వానరులు వేల, లక్షల, కోట్ల సంఖ్యలో వచ్చి ఉన్నారు. వారు రావణాసురుణ్ణి చంపి, సీతను నీకు తెచ్చి ఇవ్వటానికి సమర్థులు," అన్నాడు.

రాముడీ మాటకు సంతోషించి, "సుగ్రీవుడా, నీ వంటి వాడి సహాయంతో నేను రావణుణ్ణి అవలీలగా చంపి సీతను తెచ్చుకోగలను," అన్నాడు.

ఇంకా కిష్కింధ పరిసరాలలో దుమ్ము లేస్తూనే ఉన్నది, భూమి కంపిస్తూనే





ఉన్నది. వానరు లింకా వస్తూనే ఉన్నారు. తార తండ్రి సుషేణుడు పది వేల కోట్ల వానరులతో వచ్చాడు. సుగ్రీవుడి మామా, రుమ తండ్రీ అయిన తారుడు వెయ్యి కోట్ల వానరులతో వచ్చాడు. హనుమంతుడి తండ్రి కేసరి ఇరవైయొక్క వేల ఎనిమిది వందల డెబ్భై మంది వానరులతో వచ్చాడు. గోలాంగూలాలకు రాజయిన గవాక్షుడు వెయ్యి కోట్ల వానరులతో వచ్చాడు. ధూమ్రుడనేవాడు రెండువేల కోట్ల భల్లూకాలను తెచ్చాడు. ఇదే విధంగా పనసుడూ, నీలుడూ, గవయుడూ, దరీముఖుడూ, అశ్వనీ దేవతల కొడుకులైన మైందద్వివిదులూ, గజుడూ, జాంబవంతుడూ, రుమణ్వంతుడూ, గంధమాదనుడూ, అంగదుడూ మొదలైనవారు అంతులేని బలాలను వెంట తెచ్చారు. ఈ వానరుల నందరినీ వనాలలోనూ సెలయేళ్ళ దగ్గిరా, కొండల వద్దా విడియింపజేశారు. సుగ్రీవుడు ఈ వానర బలా లన్నిటినీ రాముడి పరం చేసి, వారిని కావలిసిన విధంగా ఉపయోగించుకోమని చెప్పాడు.

"సుగ్రీవుడా, ముందుగా మనకు రెండు విషయాలు తెలియాలి. సీత బ్రతికి ఉన్నదా, లేదా అన్నది మొదటి విషయం. రెండో విషయం రావణుడి వాస స్థల మెక్కడ అన్నది. ఈ రెండు వార్తలూ తెలిసినాక కర్తవ్యం నిర్ణయింతాం. ఈ వార్తలు సేకరించటానికి నేనూ, లక్ష్మణుడూ సమర్థులం కాము. ఆ పని నీ వల్లనే జరగాలి," అని రాముడన్నాడు.

అప్పుడు సుగ్రీవుడు వినతుడనే వానర నాయకుణ్ణి పిలిచి, "నీవు లక్ష వానరులను తీసుకుని తూర్పు దిక్కుగా వెళ్ళు. రావణుడుండే చోటు తెలుసుకుని సీత యొక్క స్థితిగతులు కనుక్కునిరా," అన్నాడు. ఇలా సీతను వెదకబోయేవారు నెల రోజుల లోపుగా తిరిగి రావాలనీ, రానివారికి మరణ



దండన విధించబడుతుందనీ సుగ్రీవుడు హెచ్చరించాడు.

తరవాత అతను నీలుణ్ణీ, హనుమంతుణ్ణీ, మహాబలుడు జాంబవంతుణ్ణీ, సుహోత్రుణ్ణీ, శరారినీ, శరగుల్మణ్ణీ, గజుణ్ణీ, గవాక్షుణ్ణీ, గవయుణ్ణీ, ఋషభుణ్ణీ, మైందుణ్ణీ, ద్వివిదుణ్ణీ, విజయుణ్ణీ, గంధమాదనుణ్ణీ, ఉల్కాముఖుణ్ణీ, అసంగుణ్ణీ, అంగదుణ్ణీ, మరికొందరు వానర వీరులనూ దక్షిణ దిశ అంతా వెదకమన్నాడు. అతను వారికి దక్షిణానగల దేశాలన్నీ వివరించి, "మీరు దక్షిణ తీరం చేరినాక సముద్రం మీదుగా పోయే ఉపాయం ఆలోచించుకోండి. ఎందుకంటే సముద్రంలో నూరు యోజనాల వైశాల్యం గల లంక ఉన్నది. అదే రావణుడి నివాస స్థానం. సీత కోసం అక్కడ చక్కగా వెతకండి. సముద్రంలో ఇంకా పర్వతా లున్నాయి. వాటన్నిటిమీదా మీరు సీతాదేవిని వెదకండి. దక్షిణ దిక్కుగా ఇంకా ఏయే రహస్య ప్రదేశాలున్నా వాటి నన్నిటినీ గాలించండి. నెల లోపలగా ఎవ రైతే తిరిగి వచ్చి, 'చూశాను సీతను' అని చెబుతాడో వాడికి నాతో సమమైన భోగ భాగ్యాలు కలుగుతాయి. వాణ్ణి నా ప్రాణాల కన్న ఎక్కువగా చూసుకుంటాను," అని వానరులతో అన్నాడు.

ఇదే విధంగా సుగ్రీవుడు పడమటి దిక్కుగా తార తండ్రి అయిన సుషేణుడు మొదలైన వారిని రెండు లక్షల వానర బలగంతో పంపాడు. లక్షమంది వానర వీరులతో సహా శతవలి అనే వాణ్ణి ఉత్తరంగా పంపాడు.

ఇంతమంది వానరులను అన్ని దిశలకూ పంపుతున్నప్పటికీ సుగ్రీవుడి ఆశలన్నీ హనుమంతుడిపైనే ఉన్నాయి. అందుచేత అతను హనుమంతుడితో, "నీవు భూమిపైనా, నీటిలోనూ, గాలిలోనూ పోగలవాడివి - మూడు లోకాలూ తెలిసిన వాడివి. నీ తండ్రి




వాయుదేవుడికి ఉన్నంత ప్రతిభ నీకూ ఉన్నది. అందుచేత సీతాదేవి దొరకటానికి అవసరమైన ప్రయత్నమంతా నీవే చెయ్యాలి," అన్నాడు.

ఈ మాటలు వినగానే రాముడు హనుమంతుడి యందు సుగ్రీవుడికి ఎంత నమ్మక మున్నదీ గ్రహించాడు. హనుమంతుడే పని సాధించుకురాగలడేమోనన్న ఆశ రాముడిలో కూడా తల ఎత్తింది. అందుచేత తన పేరు గల ఉంగరాన్ని తీసి, సీతాదేవికి గుర్తుగా ఉండగలందులకై హనుమంతుడి కిచ్చాడు. అతను హనుమంతుడితో, "సీత ఈ ఉంగరం చూసి నట్టయితే నిన్ను విశ్వసిస్తుంది, భయపడకుండా ఉంటుంది," అని చెప్పాడు. హనుమంతుడా ఉంగరాన్ని నెత్తిన పెట్టుకుని రాముడికి నమస్కారం చేసి బయలుదేరాడు.

"హనుమంతుడా, నా ఆశలన్నీ నీపైనే పెట్టుకుని ఉన్నాను. నీ శక్తికొద్దీ ప్రయత్నించి సీత దక్కేటట్టు చెయ్యాలి," అని రాముడు హనుమంతుడితో చివరి మాటగా అన్నాడు.

హనుమంతుడు తన జట్టు వానరులతో బయలుదేరి వెళ్ళాడు. అలాగే అన్ని దిక్కులకూ వానర సమూహాలు బయలుదేరి వెళ్ళాయి. వారు తిరిగి రావటానికి ఒక్క నెల గడు విధ్వబడింది. ఈ నెల రోజులూ సీత వార్తకై ఎదురు చూస్తూ రాముడు లక్ష్మణుడితో సహా ప్రస్రవణ పర్వతం పైనే గడిపాడు. సుగ్రీవుడు తన విధిని నెరవేర్చినవాడై పెద్ద బరువు దిగి పోయినట్టు సంతోషించాడు.

సుగ్రీవుడి చేత వేరువేరు దిక్కులకు పంపబడిన వానరులు సీత కోసం చాలా శ్రద్ధగా వెతికారు. వారు పగలంతా వేరు వేరు స్థలాలకు వెళ్ళి వెతుకుతూ, రాత్రి పూట ఏ పళ్ళ తోటల్లోనో తిరిగి కలుసుకుని నిద్రపోతూ నెల రోజులూ వెతికారు. నెల

పూర్తి అయేసరికి తూర్పు నుంచీ, పడమటి నుంచీ, ఉత్తరం నుంచీ వానరులు తిరిగి వచ్చి, తమకు సీత జాడ తెలియరాలేదని సుగ్రీవుడితో చెప్పుకున్నారు.

ఇక దక్షిణంగా బయలుదేరిన వానర వీరులు సీతను వెదుకుతూ చాలా దూరం వెళ్ళి వింధ్య పర్వతాన్ని చేరుకున్నారు. వింధ్య పర్వతం సామాన్యమైన పర్వతం కాదు. దానిపై ఎన్నో శిఖరాలు, ఎన్నో గుహలు! దాని పరిసరాలలో ఎన్నో నదులు, ఎన్నో దుర్గమారణ్యాలు! వానరులు ఎంతో ఓపికగా ప్రతి ప్రదేశమూ వెతికారు.

ఒక చోట వారికి ఒక భయంకరుడైన రాక్షసుడు కనిపించాడు. వాడే రావణుడై ఉంటా డనుకుని అంగదుడు వాణ్ణి ఒక్క దెబ్బతో నెత్తురు కక్కి చచ్చేట్టు చేశాడు. ఆ సమీపంలో సీత ఉంటుందేమోనని వెతికారు. కాని వారి ఆశ ఫలించలేదు.

చిట్టచివరకు అందరూ అలిసిపోయి ఒక చెట్టు కింద కూచున్నారు. అప్పుడు అంగదుడు మిగిలిన వాళ్ళతో, "సీత కోసం మనం పడిన శ్రమ ఇంతవరకు ఫలించలేదు. రోజులా చాలా గడిచాయి. సుగ్రీవుడు తీవ్రంగా దండించే మనిషి. అందుచేత మనం మరింత ఒళ్ళు వంచి వెతకాలి, నిద్రకూడా మానాలి," అన్నాడు. గంధమాదనుడు కూడా అంగదుడి అభిప్రాయాన్ని బలపరిచాడు.

ఆకలి దప్పులతో ఆర్చుకు పోతున్న గొంతుతో అతను, "సుగ్రీవుడి ఆజ్ఞ ప్రకారం అందరూ సమస్త వనాలూ, పర్వతాలూ, గుహలూ, బిలాలూ సీత కోసం వెతకండి," అన్నాడు. వెంటనే వానరులంతా లేచి వింధ్యారణ్యాలన్నీ సీత కోసం గాలించ సాగారు. వారా పర్వతమంతా గాలించే లోపలనే నెల రోజుల గడువు పూర్తి అయిపోయింది.



ప్రపంచపు వింతలు :

# 21. మృత్యులోయ

అమెరికాలోని కాలిఫోర్నియా రాష్ట్రంలో ఉన్న ఈ మృత్యులోయ అనేకమంది ప్రయాణీకులను బలి కొన్నది. ఇందులో ఒక మొక్క పెరగదు, ఒక ప్రాణి జీవించదు. అమెరికాలో ఇంత కన్న లోతైన ప్రాంతం లేదు—ఇది సముద్ర మట్టానికి 275 అడుగులు దిగువగా ఉన్నది. అమెరికా అంతకూ ఎత్తయిన మౌంట్ హ్విట్నీ (14,502 అడుగులు) ఇక్కడికి 75 మైళ్ళ దూరంలో ఉన్నది.






1. వి. శారద, హైదరాబాదు

రామాయణములోని చిత్రములలో వానరుల స్త్రీలు వానరులుగా లేక మామూలు మానవుల రూపంలోనే వున్నారే?

అవును. తార మొదలైన వానర స్త్రీలు వానరరూపంలో ఉన్నట్టుగాని, వారికి తోక లున్నట్టుగాని ఎక్కడా వర్ణించిలేదు. సుగ్రీవుడు మొదలైన వానర ముఖ్యులంతా కామరూపులు. హనుమంతుడు మొదటిసారి రామలక్ష్మణుల వద్దకు మానవ బ్రహ్మచారి రూపంలో వచ్చాడు. అలాగే సుగ్రీవుడు మొదటిసారి రాముడి వద్దకు అందమైన మానవరూపు ధరించి వచ్చాడు.

2. కె. చొక్కలింగంపిళ్ళె, వెంకట్రామాపురం

జులై నెలలోని "చాణక్యుడి కథ"కు మా చరిత్ర పాఠ్యగ్రంథాలలోని కథ విరుద్ధముగా యున్నది.

అందుకే "చాణక్యుడి కథ" జైన పురాణంలోని దని స్పష్టంగా తెలిపాము. అది చరిత్ర కాదు.

3. పి. నారాయణ, నరసాపురం

"గంధర్వ చక్రవర్తి కూతురు" కథ [జులై]లో హసన్ కుళాయి పెట్టుకొని ముసలిదాని చెయ్యి పట్టుకొన్నాడు. వెంటనే ఆమె కూడా అదృశ్యమయిందని చెప్పారు. కాని మొదట హసన్ నెత్తిన కుళాయి పెట్టుకొనియే పిల్లలను తాకినాడు కదా వారెందుకు అదృశ్యం కాలేదు.

తాకినప్పుడు అదృశ్యం అయే ఉంటారు. అదృశ్యం కావటమంటే కనిపించకుండా పోవటమే, మనిషి లేకుండా పోవటం కాదు. హసన్ పిల్లలను తాకకుండా పట్టుకుని ఉన్నట్టయితే కుళాయి మహిమ ఇంకా స్పష్టమయేది. అతను తాకినప్పుడు వారు పారిపోయారు.

4, సంకు సూర్యకుమారి, ఏలూరు

భారత చరిత్ర [మే] లో ఇల్తుత్మిష్ బల్బన్ కుమార్తెను వివాహమాడెను అని ఉంది. కాని చరిత్రలో కుతుబుద్దీన్ కుమార్తెను వివాహమాడినట్లు ఉన్నది. బల్బన్ కుమార్తెను నజరుద్దీన్ వివాహమాడినట్లున్నది. మరియు షేర్‌ఖాన్‌ను బల్బన్ విషము పెట్టి చంపినట్లు ఉన్నది. చరిత్రలో కలంజరు కోటను ముట్టడించుచుండగా మరణించినట్లున్నది.

ఇల్తుత్మిష్ కుతుబుద్దీన్ కుమార్తెను వివాహమాడిన సంగతి మార్చి సంచిక "భారత చరిత్ర"లో తెలిపాము. బల్బన్ కుమార్తె వివాహమాడినది నాసిరుద్దీన్ మహ్మూద్‌నే! మాదే పొరపాటు. షేర్‌ఖాన్‌నును, సుల్తాను విషం పెట్టి చంపించినట్లు వ్రాసినది బర్నీ అనే చరిత్రకారుడు. సుల్తాను గద్దె ఎక్కిన తరువాత ఢిల్లీకి రాని "నలభైమంది"లో షేర్‌ఖాన్ కూడా ఉన్నాడు. షేర్‌ఖాన్ అతి సమర్థుడు. అందుచేత సుల్తాను భయపడి ఉండవచ్చు. కలింజరు ముట్టడికి షేర్‌ఖాన్ చావుకూ సంబంధం తెలియరావటంలేదు.

5. పంగ్రతంగి వెంకటేశ్వరరావు, భీమవరం

చందమామ వేసవికాలంలో కంటె శీతాకాలంలో ఎక్కువ కాంతివంతంగా వుంటుందంటారు. నిజమేనా? కారణం? ఎత్తయిన ప్రదేశము నుంచి చూచినప్పుడు మామూలు కంటె ఎక్కువ ఆకాశము, నక్షత్రాలూ కనపడతాయి.

శీతాకాలంలో గాలిలో ధూళి తక్కువ గనుక చంద్రుడు కాంతివంతంగా కనిపించవచ్చు. ఎత్తునుంచి చూస్తే సహజంగా ఆకాశం జాస్తిగా కనిపిస్తుంది గనక నక్షత్రాలుకూడా కనిపిస్తాయి. ఉదయమూ, సాయంకాలమూ సూర్యుడు మనకు కనబడనప్పుడు కూడా సూర్య కిరణాలు ఎత్తున ఉండే మబ్బులపై పడటంలేదా, అవి సూర్యుణ్ణి చూస్తూన్నట్టే గదా.

6. బండారు రాములు, జాంగ్రడపేట

రాముడు ధర్మం ఆచరించాడా? తమ్ముని భార్యను వాలి పరిగ్రహించటంలో గల అధర్మం సుగ్రీవుడు అన్న భార్యను పరిగ్రహించటంలో లేదా?

ఈ సందేహాన్ని చాలామంది పాఠకులు వెలిబుచ్చారు. తమ్ముడి భార్యను అన్న పరిగ్రహించటమే వాల్మీకి కాలంలో హెచ్చు అధర్మంగా కనబడుతుంది. అదీగాక వాలి చనిపోయిన అనంతరం సుగ్రీవుడు తారను చేపట్టాడు. వాలి రుమను చేపట్టినప్పుడు సుగ్రీవుడు బతికే ఉన్నాడు.

Photo by Ananth Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

వీడని జోడూ

పంపినవారు:
సి. ఎస్. శంకరమ్, నిడుబ్రోలు

Photo by Prabhakar Mahadik



బహుమతి
పొందిన వ్యాఖ్య

విడిపోయే యీడూ

పంపినవారు:
సి. ఎస్. శంకరమ్, నిడుబ్రోలు

# ఉల్కలు

★ మానవులకు ఉల్కలను గురించి అనాదిగా తెలుసు. 4 వేల సంవత్సరాల క్రితం ఈజిప్షనులు ఉల్కలను గురించి రాసి పెట్టిన రికార్డు ఇప్పటికీ లెనిన్‌గ్రాడ్ హెర్మిటేజ్‌లో ఉన్నది. ఇదే ఉల్కలకు సంబంధించిన అత్యంత ప్రాచీనమైన రికార్డుగా కనిపిస్తుంది.

★ చీనావారి చిత్రాలలో క్రీ. పూ. 1768 లో "నక్షత్రాల వర్షం" కలిగినట్టు చెప్పి ఉన్నది. ఇది ఉల్కలజల్లు అయి ఉండాలి.

★ 18-వ శతాబ్దం అఖరు నుంచీ ఉల్కలను గురించి ప్రత్యేక ఖగోళశాస్త్రం ప్రారంభమయింది. దీని ఫలితంగా ఉల్కలు అంతర్గ్రహాకాశ ప్రాంతం నుంచి వస్తాయని రుజువు చేశారు. ఉల్కలు మనకు కనిపించే ఎత్తూ (80 నుంచి 120 కిలోమీటర్లు), వాటి వేగమూ (సెకండుకు 10 నుంచి 70 కిలోమీటర్లు) తెలుసుకున్నారు. ఉల్కలకూ తోకచుక్కలకూ సంబంధం ఉన్నట్టు కూడా రుజువయింది.

★ అకాశంలో ఉల్కలు సమూహాలుగా కూడా తిరుగుతాయి. అలాటి సమూహాలలో "లియోనిడ్ సమూహం" ఒకటి. ఇది 33 సంవత్సరాల కొకసారి కనిపిస్తుంది. అనేక దేశాలలోని పాత రికార్డులను పరిశీలించగా "లియోనిడ్" 3,500 ఏళ్ళపైచిలుకుకాలం నుంచీ గమనించబడుతున్నట్టు రుజువయింది.

★ ఉల్కయొక్క మొట్టమొదటి ఫొటోగ్రాపు ప్రాగ్ (జెకోస్లావాకియా) లో 1885 లో తీయబడింది. తరువాత ఉల్కా పరిశోధనల నిమిత్తమై అనేక ఫొటోలు తీయబడ్డాయి. ఈనాడు ఉల్కలను పరిశోధించడానికి శాస్త్రవేత్తలు దూరప్రయాణాలు కూడా చేస్తారు.

★ ఉల్కలను ఫొటోగ్రాపు చేసి వాటి ద్వారా పరిశోధనలు సాగించటంలో అమెరికనులు అద్భుతప్రావీణ్యం ప్రదర్శించారు. కన్ను చూడ గల ప్రతి ఉల్కనూ వారు ఫొటోగ్రాపు చేశారు.

★ ఉల్కా పరిశోధనల ఫలితంగా గాలి యొక్క పొరలు 120 కిలోమీటర్ల ఎత్తువరకూ, ఏ ఎత్తున ఎంత సాంద్రత ఉండేదీ, ఎలాటి ఉష్ణస్థితి ఉండేదీ అంచనా కట్టబడింది.

★ సాధారణంగా ఉల్కలు నలుసుల ప్రమాణంలోనూ, రేణువుల ప్రమాణంలోనూ ఉంటాయి. కొన్ని మరీ పెద్దవి కూడా ఉంటాయి. ఇవి గాలియొక్క ఎగువ పొరలలో కాలి భస్మంకాక దళమైన కింది పొరలదాకా మండుతూ వస్తాయి. ఇలాటి ఉల్కలను అగ్నిగోళాలంటారు.

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు 1963 అక్టోబర్ నెల సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ అగస్టు నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## ఆగస్టు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: వీడని జోడూ

రెండవ ఫోటో: విడిపోయే యీడూ

పంపినవారు: చన్నాప్రగడ సీతారామ శంకరమ్,

నిడుబ్రోలు, (గుంటూరుజిల్లా.)

బహుమతి మొత్తం రు. 10/— ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# భారతం

కాలం గడిచింది. ధృతరాష్ట్రుడి పైన పెద్దరికం ఉంచి పాండవులు సుఖంగా రాజ్యం ఏలుకుంటున్నారు. విదురుడూ, సంజయుడూ, యుయుత్సుడూ, కృపుడూ ధృతరాష్ట్రుణ్ణి కొలిచి ఉండేవారు. వ్యాసుడు అప్పుడప్పుడూ వచ్చి ఆయనకు ఏవేవో కథలు చెబుతూండేవాడు. ధర్మరాజు ఆయనతో చెప్పకుండా ఏ పనీ చేసేవాడు కాదు.

ధృతరాష్ట్రుణ్ణి పాండవులు కొలిచినట్టే గాంధారిని కుంతీ, ద్రౌపదీ, సుభద్రా, ఉలూచీ మొదలైన వాళ్ళు కొలిచేవారు. ఆ వృద్ధ దంపతుల మనస్సుకు కష్టం కలిగించిన వారిని శిక్షిస్తానని ధర్మరాజు ప్రకటించాడు కూడా. వాళ్ళుకూడా గతాన్ని మరిచిపోయి పాండవులను తమ పిల్లల్లాగే చూసుకునేవారు.

పానకంలో పుడకలాగా భీముడొక్కడు మాత్రం ధృతరాష్ట్రుణ్ణి మనసారా ద్వేషించేవాడు. ధృతరాష్ట్రుడికి కూడా భీముణ్ణి తలుచుకుంటే పుత్రశోకం వచ్చేది.

ఈ విధంగా పదిహేనేళ్ళు గడిచాయి. అయినా భీముడి ప్రవర్తన ఏమీ మారలేదు. అతను ధృతరాష్ట్రుడికి బాధ కలిగించే పనులు చాటుమాటుగా చేస్తూనే ఉన్నాడు; ధృతరాష్ట్రుడి సేవకులను కూడగట్టుకుని వాళ్ళు చేయవలసిన పనులు జరగకుండా చేస్తున్నాడు. తన మిత్రులను చేర్చి జబ్బలు చరుచుకుంటూ, "ఈ చేతులతో గాంధారీ ధృతరాష్ట్రుల కొడుకు లందరినీ చంపాను! ఇప్పటికీ వాళ్ళను తలుచుకుంటే మండిపోతుంది. వాళ్ళని బలి తీసుకున్న ఈ చేతులకు గంధం పూయాలి!" అంటూనే ఉన్నాడు.

ఇలాటి మాటలూ, చేష్టలూ విని ఆ వృద్ధ దంపతులు కుమిలిపోతూండేవారు. భీముడి ప్రవర్తన గురించిగాని, దాని మూలంగా గాంధారీ ధృతరాష్ట్రులు పొందుతున్న మనఃక్లేశం గురించి గాని ధర్మరాజుకు తెలియదు. గాంధారీ ధృతరాష్ట్రులు తిండికూడా మాని, రోజుకు ఒక్కసారే తింటూ, దర్భలపై పడుకుంటూ కృశించసాగారు.

కొంత కాలం గడిచాక ధృతరాష్ట్రుడు ధర్మరాజుతో తనకు వానప్రస్థం వెళ్ళి తపస్సు చేసుకోవాలని ఉన్నదనీ, తన వెంట గాంధారీ, విదురుడూ, సంజయుడూ, కృపుడూ వస్తారనీ, అందుకు సమ్మతించమనీ అడిగాడు.

ఈ మాటలు విని ధర్మరాజు చాలా బాధపడి, "నీ కింత విరక్తి కలిగితే నా కిక ఈ రాజ్యం దేనికి? ఈ వయసులో నిన్ను వనానికి పోనిచ్చి, కష్టాలు పడనిస్తే లోకం నన్నేమంటుంది? నీ మనసులో ఏదైనా సంతాపం ఉంటే చెప్పు, దాన్ని నేను తొలగిస్తాను. అంతేకాని నీవు అరణ్యవాసం వెళ్ళటానికి నేను సమ్మతించను!" అన్నాడు.

ఇందువల్ల ధృతరాష్ట్రుడికి మరింత బాధ కలిగిందే గాని ఆయన నిశ్చయం మారలేదు. ఆ సమయానికి వ్యాసుడు వచ్చి, ధర్మరాజుతో ధృతరాష్ట్రుడి నిశ్చయం సరి అయినదని చెప్పి ఒప్పించాడు.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'




# బ్రిటానియా గోల్డెన్ పఫ్




బ్రిటానియా వారే ప్రత్యేకంగా తయారుచేసే యీ గోల్డెన్ పఫ్ బిస్కట్లు తాజాగా కరకరలాడుతూ వుండి పుష్టినిచ్చును. కాఫీ, టీ, త్రాగేటప్పుడు సేవించుటకు అనువైనవి. జామ్, వెన్న, జున్నులతో కూడ సేవించవచ్చును. రుచి చూడండి — నోట్లో కరిగిపోతాయి. నేడే కొనండి. కమ్మగా రుచిగా వుండే యీ తాజా బ్రిటానియా గోల్డెన్ పఫ్ బిస్కట్లను సేవించి ఆనందించండి.

## బ్రిటానియా బిస్కట్లు






JWTBC 5910 A








త్వరలో విడుదల

ఎన్.టి.రామారావు రాజనాల నాగయ్య గుమ్మడి రేలంగి
రమణారెడ్డి వంగర కృష్ణకుమారి ఇ.వి.సరోజ గిరిజ
మీనాకుమారి మొదలైన తారా సందోహముతో
సినిమా జగతిలో, జానపద చిత్ర సంప్రదాయములలో
నూతన చరిత్రను సృష్టించే
రసవత్తర రామణీయక చిత్రము

రాజలక్ష్మీ ప్రొడక్షన్స్ వారి మహోజ్వల చలనచిత్రము





(ఈస్ట్‌మన్ కలర్ దృశ్యములతో)

రచన మహారథి సంగీతం ఘంటసాల
కళ కృష్ణారావు. కెమెరా రవికాంత్. ఎడిటింగ్ ప్రకాష్. * దర్శకత్వం విఠలాచార్య నిర్మాతలు సుందర్‌లాల్ నహతా, డూండీ
రాజశ్రీ రిలీజ్

